చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి


| విషయము | | పేజి |
|---|---|---|
| వింతతీర్పు | ... | 10 |
| సూర్యకిరణం | ... | 13 |
| అపూర్వ సౌధం | ... | 17 |
| తమ్మిరాజు తెలివి | ... | 25 |
| టాక్సీలో పర్సు | ... | 29 |
| గంధర్వ కన్యలు | ... | 33 |
| దాయాదులు | ... | 39 |
| తనదాకా వస్తే | ... | 42 |
| నాన్నకోసం | ... | 44 |
| ఇంద్రజాలం | ... | 50 |
| రంగుల బొమ్మకథ | ... | 53 |


ఇవన్నీగాక పజిలు, పాటలు, ఇంకా, ఇంకా ఎన్నో వున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు 1686
మద్రాసు. 1.

మార్చి విడుదల!

భరణీ వారి

# ప్రేమ

"Love"

భానుమతి
నాగేశ్వరరావు

ముక్కామల.. సి.యస్.ఆర్.
శ్రీరంజని (జూనియర్)
రేలంగి...శివరావు
సీతారాం





మ్యూజిక్
సుబ్బరామన్
ఫొటోగ్రఫీ
కమాల్ ఘోష్
పాటలు, మాటలు
....శర్మ....
ఆర్టు
కె.నాగేశ్వరరావు

స్టూడియో
వాహిని




డైరెక్టర్... రామకృష్ణ

ఆంధ్ర, సీడెడ్, నైజాములకు
పూర్ణా పిక్చర్సు లిమిటెడ్, విజయవాడ

మైసూర్ సంస్థానం, కూర్గులకు
డ్రీంలాండ్ పిక్చర్సు కార్పొరేషన్, బెంగుళూరు సిటీ

వివరములకు: భరణీ పిక్చర్సు, మదరాసు - 17.

## చందమామ పాఠకులకు గమనిక

## ... చిరునామా మార్పు ...

2 & 3 ఆర్కాట్ రోడ్డు, కోడంబాకమ్, మదరాసు - 24



## తపాలాపెట్టె నంబరు వ్రాయకండి



త్వరలోనే చందమామ మళయాళం, మహరాష్ట్ర
భాషలలోకూడ వెలువడబోతున్నది.



విశాలాంధ్రలో విజయవంతముగ
ప్రదర్శింపబడుచున్నది!

వినోదా
వారి

# శాంతి

దర్శకత్వం
వేదాంతం రాఘవయ్య

*  *

చంద్రకుమారి
సావిత్రి.. సి. హేమలత
డా॥ జి.వి.సుబ్బారావు
రామచంద్రకాశ్యప
అరణి.. పేకేటి



సంగీతము సుబ్బరామన్... రచన కొవ్వలి... పాటలు సముద్రాల jr. ... ఛాయ రంగా... కళ వాలి, గోడ్గాంకర్

MATA

పూర్ణా రిలీజ్

వివరములకు :— వినోదా పిక్చర్స్, గోపాలకృష్ణారోడ్-మదరాసు-17






అందమును వర్చస్సును పెంపొందించుటకు అన్ని కాలములలోను నమ్మకముగ "రవిగ్లిసరిన్" సబ్బును వాడుడు.

"బ్రహ్మాల్" తలనూనె ఉపయోగించినందువలన చక్కని నిడుపైన కురులు పెరుగును. ఆనందకరమైన వాసన కలది. మెదడును చల్లదనముగను, శాంతముగనుంచు ఓషధులతో తయారు చేయబడినది.



వ్యాపార వివరాలకు:

## ది న్యూ స్టార్ అండ్ కో.,

10, వైద్యనాథ మొదలి వీధి, తండియార్పేట, మదరాసు - 21

## పిల్లలంటే తల్లులకు తీపి
## పిప్పరమెంట్లు పిల్లలకు తీపి









**M.A.P. INDUSTRIES**
**TONDIARPET. MADRAS.21**

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి



సంపుటి 10 : సంచిక 3 మార్చి 1952

మనదేశం చాలా చిత్రమైనదేశం. ఇక్కడ మనిషికొక మతం, మండలానికొకభాష. ఇన్ని మతాలూ ఇన్నిభాషలూ గల దేశం ప్రపంచంలో మరిఒకటి లేదనటం అతిశయోక్తికాదు. ఒక రాష్ట్రంలో ప్రజలకు ఒక విషయం చెప్పాలంటే ఆ రాష్ట్రభాషలో చెబితేనే వాళ్ల మనసుకు హత్తుకుంటుంది. మహత్తరమైన ఈ వుద్యమం నెరవేర్చాలనే వుద్దేశంతోనే చందమామ మన దేశభాష లన్నింటిలోనూ అవతరించటానికి సంకల్పించింది. ముందుగా తెలుగు, తమిళం, కన్నడం, హిందీ భాషలలో వెలువడిన చందమామకు ఆయా రాష్ట్రాలలో పాఠకులు జేజేలు కొట్టడంతో 'మన సంకల్పం సరి ఐనది, ఇంతవరకు దీనిని సవ్యంగానే నెరవేర్చగలిగాము' అని ఒక నిశ్చయానికి వచ్చాము. ఈవిధంగా ఏర్పడిన బాటను అనుసరించి తక్కిన రాష్ట్రాలన్నిటిలోనూ క్రమంగా చందమామ సంచారం చేయబోతున్నది. ఇప్పుడు మళయాళ, మహరాష్ట్ర భాషలలో వెలువడటానికి సంకల్పించటం ఈ సంచారంలో ఒక మైలురాయి చేరుకోవడమన్నమాట. ఈ వార్తను మేము వెల్లడించగానే సహకారాన్నీ, అభిమానాన్నీ చూపుతూ పై రెండు రాష్ట్రాల నుంచీ లేఖలు కురియనారంభించినై. ఉత్సాహకరమైన ఈఆదరం మాఉద్యమానికి చక్కటి ఊత నిస్తున్నది.





# వింత తీర్పు

ఒక్కతూరి ముక్కుకూ కనులకూ
నడుమ తగాదా రేగింది.
కళ్ళజోడు ఎవ్వరిదని వాదన,
చర్చ విరివిగా సాగింది.

శ్రీశ్రీ నాలుక బి. యే. బి. యల్.
తీవ్రంగా వాదించారు.
ఎగిరిదుమికి ఇరుదవడల నడుమను
బల్లగుద్ది రోదించారు.

చెవులు ప్రధాన న్యాయమూర్తులుగా
చెవి నిక్కించుక విన్నారు.
కోర్టు గ్రుడ్డిదే, కాని నేర్పుగా
తీర్పిస్తుందని అన్నారు.

నాలుకగారన్నారు - 'దేవరా!
కళ్ళజోడు పరికించండీ!
ముక్కుకొరకు నిర్మింపబడిందని
మీకు విశదమౌతుందండీ!

అంతేగాక ముక్కుమీదున్నది
ఇది చాలారోజులనుంచీ.
ముక్కుకు చెందుతుంది ఇది తప్పక
అని యనవచ్చు ఇందునుంచి.

రచన:

"బైరాగి"

ఇంకొకమాట, ముక్కు లేదనుకోం
డిక ఈ కళ్ళజోడు ఎక్కడ!
ముక్కును విడచి కళ్ళజోడుండదు.
ముక్కెక్కడ వుంటే అక్కడ!

దీనివల్ల తేలిందేమంటే
ముక్కూ మరియు కళ్ళజోడూ,
ఆధారాలొండొంటికి, ఉంటవి
అవి ఒకదానికొకటి తోడూ."

ముగించారు నాలుకగారిట్లా
ముక్కుతరుఫు చేసే వాదన,
ధోరణిమార్చి కనులతరుఫున తను
గావించాడు ప్రతివాదన.

న్యాయమూర్తి శ్రీ చెవులంగారలు
అంతా ఠీవిగ విన్నారు.
బుర్ర గోకుకొని కాస్త దగ్గుతూ
తీర్పుచెప్పుతూ అన్నారు—

"విన్నాం చెప్పినదంతా; ముక్కది
కళ్ళజోడు అని ఋజువైనది.
జోడున్నప్పుడు కనులుమూసుకొని
ఉండాలని తేల్చడమైనది."





# ధర్మచింత



ఒకప్పుడు ఒకవూరికి ఒక యతీశ్వరుడు వచ్చి, గ్రామస్థులకు నీతులు బోధింపసాగాడు. ఆ వూరి స్కూలు మేష్టరు కూడా బోధలు వినటానికని వెళ్ళాడు. యతి చెప్పినదంతా విన్నతరవాత వాళ్ల వాళ్లకు మనస్సులో వుండే సందేహాలన్నీ అడిగి జవాబులు తెలుసుకొంటూ వచ్చారు ప్రేక్షకులు.

మేష్టారూ ఒక ప్రశ్న అడిగారు: 'మహాత్మా!—దానధర్మాలు చేస్తూ వుండాలని సెలవిచ్చారే, చాలీచాలని ఆదాయంలో నావంటివాడు ఏమి ధర్మం చేయగలడుస్వామీ, చెప్పండి!' అని. అందుకు ఆసన్యాసి, 'ఇదే అజ్ఞానమంటే. ధర్మమనేదానికి పరిమితి యేమున్నది? ఎవళ్ల శక్తికొద్దీ వాళ్ళు తాహతునుబట్టి చేయవలసిందేకాని, ఇంత ఇస్తేకాని వీలుకాదు అని ఏ శాస్త్రమూ నిరోధించటంలేదు. వందలూ వేలూ అక్కరలేదు, మీకు వచ్చే రాబడిలో, రూపాయకు ఒక్క దమ్మిడి ధర్మంకోసం వినియోగించండి, చాలు' అని చెప్పాడు.

తేలికబడిన హృదయంతో మేష్టారు 'ఒస్, ఇంతేనా? రూపాయికి దమ్మిడీయేనా నేను కేటాయించవలసింది!' అంటూ, సెలవుతీసుకు వెళుతూవుండగా ప్రయివేటుచెప్పిన బాపతు ఒక రూపాయి అనుకోకుండా చేతికి అందింది. ఎంతో సంతోషంతో మేష్టారు 'భేష్, బాగావుంది. ఇప్పుడే ఈ రూపాయిలో ఒక్క దమ్మిడీ ధర్మంచేస్తాను' అనుకొన్నాడు.

అంతలోనే ఒక బిచ్చగాడు వచ్చి చెయ్యి జాపాడు. మేష్టారికి బుద్ధి మరలిపోయింది. ఈ ఇచ్చు రూపాయి మార్చటమెందుకు? ఇంటికిపోయి ఒక దమ్మిడి తెచ్చియిస్తే పోయిరి!' అనుకొంటూ వెళ్ళిపోయాడు. తీరా ఇంటికి పోయి పెట్టెలో చూడగా, సరీగా ఒక నిండు పావలాకాసున్నది. అది మార్చి ఒక దమ్మిడీ తీసివేస్తే మూడణాల పదకొండు దమ్మిడీలు మాత్రమే వుంటుంది. అందుకని విడగొట్టడానికి మనస్కరించిందికాదు.

ఇలా ఎన్నోదఫాలు వాయిదావేస్తూ, చివరకు విరక్తిభావంతో 'నేనూ ఒక యాచకుణ్నే. ఒకళ్ళకు నేను దానం చేసేదేమిటి?' అనుకొని, అప్పటినించీ ఆయన ధర్మచింత మానుకొన్నాడు.



# సూర్యకిరణం

పూర్వం ఘూర్జరదేశాన్ని పరిపాలించిన రాజులలో ఒకాయనకి గుఱ్ఱాలంటే ఎక్కువ ప్రీతిగా ఉంటూండేది. బోలెడంత సొమ్ము ఖర్చుపెట్టి, యెక్కడెక్కడ ఉన్న గుఱ్ఱాలనైనా కొనేసి రప్పించి తన అశ్వశాలలో కట్టించేస్తోండేవాడు. ఎంత రాచకార్యమున్నా రోజూ ఒక్కసారి అపురూపమైన అశ్వశాలకు వెళ్ళి, తన గుఱ్ఱాలనన్నింటినీ స్వయంగా చూచుకొని, వాటి మెడలుతట్టి, పలంకరించివస్తేగాని ఆయనకి ఏమీ తోచేదికాదు. గుఱ్ఱాలంటే అంతప్రీతి గనకనే ఆయనకి 'గుఱ్ఱాల రాజు' అనే పేరు సార్థకంగా నిలిచిపోయింది.

ఒకరోజున ఆయన కొలువుతీర్చి ఉండగా ద్వారపాలకుడు వచ్చి, "ప్రభూ, అరబ్బీవాడొకడు ఒక గుఱ్ఱాన్ని తెచ్చి ద్వారంవద్ద కనుపెట్టుకొని ఉన్నాడు. తమ దర్శనం కావాలంటున్నాడు" అని చెప్పాడు.

గుఱ్ఱంమాట చెవిని పడీపడటంతోనే ఆ అరబ్బీవాణ్ణి చూడటానికని రాజుగారు తటాల్న గద్దెమించి లేచి ఎంతో ఆత్రంతో దిగివచ్చారు.

అరబ్బీవాడు వంగి సలాంచేసి, "ప్రభూ, ఇది చాలా గొప్పగుఱ్ఱం. ఈ గుఱ్ఱాన్ని ఎంత మంది అడిగినా ఇవ్వక, తమకు సమర్పించటానికని తెచ్చాను. ఈ గుర్రం ఎటువంటి మేలుజాతిదో, దాని గుణాలు నాకు నేనే వర్ణించటం సమంజసంగా వుండదు. ఇంచుమించు మా అరేబియాదేశం మొత్తానికే దీనిమోస్తరు గుర్రం కనబడదంటే అతిశయోక్తికాదు. అందుకనే, అశ్వపరీక్షలో ఏలికకు గల ఆసక్తి విని, ఈ గుర్రం తమవద్దనే ఉండితీరాలని నిశ్చయించి, తీసుకవచ్చాను" అన్నాడు.

అందుకు రాజుగారు, "ఐతే, ఎంతేమిటి దీనిఖరీదు?" అని అడిగేరు.

---

జి. సుభద్ర, అనంతపురం

---




అడిగితే దాన్ని తెచ్చినవాడు పదివేలే అడిగేడు. వాడు అడిగినంతా ఇచ్చేసి పుచ్చుకున్నాను!" అన్నారు.

అప్పుడు అరబ్బీవాడు, "ప్రభూ, తాము బేరం అడగరనే వుద్దేశంతోనే 'లక్షరూపాయలు' అని చెప్పి ఊరుకున్నాను. మరొకరికైతే రెండు లక్షలు చెప్పవలసిందే!" అని రెట్టించాడు.

రాజుగారు ఇంకా ఆశ్చర్యపోయారు. "ఏమిటోయ్ నీగుఱ్ఱం గొప్ప?" అన్నారు.

"దీని గొప్పతనమేమిటో నేను భట్టుకి మల్లే వర్ణించట మెందుకు? దీన్ని కొనేసి చూడండి! తమకే బోధపడుతుంది" అన్నాడు వాడు.

అదేమిటో చూద్దామన్న ఆత్రంతోనూ, గుఱ్ఱాలంటే సహజంగాఉండే మక్కువ చేతనూ, వెంటనే మంత్రికేసి చూసి, "ఒక లక్షరూపాయలు తెప్పించి ఇతడికివ్వండి!" అన్నారు రాజుగారు.

మంత్రి నిర్ఘాంతపోయి, "ప్రభూ, ఒక్క పర్యాయం ఆలోచించండి. లక్షరూపాయలు! తీరా చేయి దాటిపోయిన తరువాత ఏమనుకొన్నా ఏమీ లాభంలేదు" అన్నాడు రహస్యంగా.

"ఎంతేనా ప్రభూ? ఒక్క లక్ష రూపాయలు" అన్నాడు వాడు.

రాజు ఆశ్చర్యపోయి, "అబ్బీ, యెంత గొప్ప గుఱ్ఱమైనా లక్షరూపాయలేమిటి? చాలా విడ్డూరంగావున్నదే ఈమాట. నా అశ్వశాలలోకల్లా మిక్కిలి ఉత్తమోత్తమమైన 'వాయువాహనమ'నే అశ్వానికి పాతిక వేలకన్నా యెక్కువ ఇవ్వలేదు నేను. 'రామబాణ'మనే గుఱ్ఱానికి పదిహేనువేలిస్తే దాని యజమాని ఆ సొమ్ము కళ్లనద్దుకుని గుఱ్ఱాన్ని సమర్పించి వెళ్ళేడు, తెలుసా? ఇంక 'వేగవతి' అనే గుఱ్ఱంధర చెబుతా విను: అది పదివేలు. 'ఎంత కావాలీ?' అని




రాజుగారు, "ఇవ్వండి చూద్దాం" అనేసరికి, విధిలేక లక్ష రూపాయలూ రప్పించి అరబ్బీవాడికి అందించాడు మంత్రి.

అరబ్బీవాడు మూట అందుకుని తన గుఱ్ఱాన్ని సమీపించి, దానితో అప్పగింత మాటలు చెబుతూన్నట్లే నటించి, చటుక్కుని దాని వీపుమీదికెగిరి, 'ఛల్!' అన్నాడు. ఏముంది? రాజూ, మంత్రీ, సేనానీ, అంతా చూస్తోండగానే ఆ గుఱ్ఱం ఇట్టే పరుగెత్తి, అట్టే మాయమైంది!

రాజు తెల్లబోయి చూస్తో, "అరే, మోసం! లక్ష రూపాయిలూ పుచ్చుకుని గుఱ్ఱంమీద పారిపోతున్నాడే! పట్టుకోండి! పట్టుకోండి!!" అని కేకవేశాడు.

వెంటనే ఆయనవద్దనున్న వీరులు అరబ్బీవాణ్ణి పట్టుకోటానికని తమగుఱ్ఱాల మీద బయల్దేరి, వెంటాడజొచ్చారు.

'వాయువాహనం', 'రామబాణం' 'వేగవతి' అనే పేర్లుగల గొప్ప గుఱ్ఱాలన్నింటి మీదా కూడా యెక్క అరబ్బీవాణ్ణి తరుము కెళ్ళారు ఆ వీరులు.

రాజుగారు అనేకవిధాల విచారిస్తూ, "మనల్ని ఎంతగానో నమ్మించి, లక్ష రూపాయలూ కాజేసి ఎంత మోసంచేశాడు, దుర్మార్గుడు!" అన్నారు.

"ప్రభూ, నేను చెబుతే విన్నారుకాదు కదా!" అంటూ ఒక్కసారి ముదలకించాడు మంత్రి.

రాజుగారు చికాకుపడి "నువ్వేం చెప్పే వయ్యా, వాడు ఇలా సొమ్ముతో దౌడుతీస్తా డని చెప్పేవా ఏమన్నానా? ఇటువంటి విష యాల్లో లౌక్యమేవిటి, స్పష్టంగా అనుకో వాలిగాని?" అని గదమాయించారు.

ఇంతలో దూరాన ఏదో ధూళి ఎగసివస్తూ న్నట్లు కనిపించింది. "అరబ్బీవాడి అంతు దొరక్క మన 'వాయువాహన'మో, 'రామ

బాణ'మో, 'వేగవతో' తిరిగివస్తూన్నట్లుం" దన్నారు రాజుగారు నిస్పృహతో.

"మరేనండి" అన్నాడు మంత్రి.

ఇంతలో ఆ లక్షరూపాయల గుఱ్ఱమే వచ్చి ప్రభువువారి సమక్షాన నిలబడింది. దానిమీదనుంచి అరబ్బీవాడు దిగి, "సలాం ప్రభూ! తామిక్కడ నిలబడి ఉండగానే నేను ఈ గుఱ్ఱంమీద యాభై మైళ్ళదూరం చుట్టివచ్చాను. నన్ను తరుముకుంటూ బయల్దేరిన మీ గొప్పగొప్ప అశ్వికులంతా ఇక్కడికి చేరుకోటానికి ఇంకా మూడు గంటలసేపు పడుతుంది! ఇందాక నేను తమతో 'ఈ గుఱ్ఱాన్ని కొనేసిచూడండి! దీని విలువ మీకే బోధపడుతుంది' అని మనవి చేశానే. ఇది లక్షరూపాయలూ చేస్తుం దంటారో లేదో మరి ఇప్పుడు తామే సెల వీయండి?" అన్నాడు.

రాజుగారు ఆశ్చర్యంతో "భేష్ లక్ష కాదు, పదిలక్షలైనా చేస్తుంది! నిజానికి, ఇటువంటి చిత్రమైన హయాన్ని ఇంత వరకు మేము చూచి ఎరుగము.—నీ మాటలలో ఒక్కటీ అబద్ధంలేదని ఇప్పుడు రుజువవుతూనేవుంది. చెప్పకపోవడమేం? ఆ లక్షా పుచ్చుకుని నీవు ఉడాయించావనే అనుకున్నాముసుమా!" అన్నారు.

"ఎంతమాట? అలా నమ్మించి మోసం చేయుటం మా యింటావంటా లేదు. ప్రభువులకి దీని సామర్థ్యాన్ని మాటలతోగాక చేతలలో చూపించటానికని ఇలాచేశాను. ఈ గుఱ్ఱంపేరు 'సూర్యకిరణం.' సూర్యకాంతి ఎంత వేగంగా ప్రసరిస్తుందో అంత వేగంగా ఇది పరుగెత్తగలదు. ప్రభువులు దీన్ని స్వీకరించి, నాకు తగిన బహుమతీకూడా దయచేయించాలి!" అన్నాడు.

సూర్యకిరణం గొప్పదనానికీ, అరబ్బీవాని నిజాయితీకీ మెచ్చుకుని రాజు మరొక పదివేల రూపాయలు అదనంగా వాడికి బహుమతీ ఇచ్చి పంపివేశాడు.






## 3

'తనూ పోతే మరి, యువరాజుకి దిక్కెవరూ?'—ఈ సమస్యతో కృపాసింహుని మనసు వేగిపోయింది. వేగిపోవడమేమిటి! బెంగతో మరి కొద్దిరోజులకే రాణిని చేరుకొన్నాడు!! తండ్రికూడా గతించటంతో ఇప్పుడు పాపం, దేవసింహుడు కేవలమూ దిక్కులేని పక్షి ఐపోయినాడు.

'పసివాడు సొట్టవాడు. తల్లిలేదు. తండ్రిలేడు. ఈ నిసుగును ఆదుకొనేవారెవరు?'—రాజ్యంలో ఎవరినోట విన్నా ఇదే మాట. ఇదే ఆలాపన. 'రాజకుమారుని గతి ఏమిటి కాబోతుందా' అని ప్రతివాని హృదయమూ తల్లడిల్లిపోసాగింది.

రాజ్యమంతా ఈ విధంగా అట్టుడికిపోతూవున్న సమయంలో ప్రజల తాపాన్ని అణచగల ఒక చిన్న సంఘటన జరిగింది. బావమరది మృతికి అపారమైన దుఃఖంతో కుమిలిపోతూవున్న శక్తిసింహుడు కొంచెం తెప్పరిల్లి, ముఖ్యులనందరినీ దర్బారుకు రప్పించాడు. తీరని సంతాపంతో అందరి యెదటా ఇలా విన్నవించాడు:

"అయ్యా!—ఈ రాజ్యాన్ని దిగ్విజయంగా నడిపిస్తూవచ్చిన సమర్థులు మీరు. మీ సలహాలవల్లనే మా బావమరిది మన రాజ్యాన్ని రామరాజ్యంగా పరిపాలించగలిగాడు. ప్రజలందరనూ సుఖవంతులను చేయుగలిగాడు. అటువంటి నా బావమరదిని బ్రతికించుకోలేకపోయిన దురదృష్టవంతుడను నేను. ఆకస్మికంగా అక్క దివికేగి నన్ను శోకంలో ముంచివేసింది. ఆ కంటితడి



అరకుండానే, అయ్యో!—నా బావమరది నన్ను దగాచేసి విడనాడిపోయాడు!!—ఇలా దెబ్బమీద దెబ్బ తగిలినందుకు నేనేనాడో చచ్చిపోయి ఉండవలసింది. కాని, ఈ దురదృష్టవంతుడు—అభాగ్యుడు—ఇంకా జీవించి వున్నాడంటే ఎందుకో మీరే ఊహించుకోగలరు...ఇడిగో! ఈ పసివాడి కోసం! అంగవికలుడైన ఈ నిసుగుకోసం!!-అక్కా బావా, ఇద్దరూ కలిసి ఈ చిన్నవాడిని నా చేతులలో పెట్టిపోయారు. వీడిని ఏమిచేయటమో తోచక, ఇంకా బ్రతికి వున్నాను. వీడిని ఎలా కాపాడటం? బుద్ధిమంతులైన మీరంతా బాగా యోచించి ఏదో వొకటి నిశ్చయించి చెబితే, వీడిని మీకు వప్పగించివేసి, నా దారి నేను చూచుకొంటాను. తలుచుకున్నంత మాత్రంచేతనే ఈ పసివాని చరిత్ర గుండె పగలకొడుతున్నది. నిరంతరమూ చూస్తూ యెలా ఉండగలను!' అంటూ సభవారికి ప్రశ్న వేశాడు. వేసి ఊరకున్నాడు.

శక్తిసింహుని వాక్కులకు అందరూ దిగ్భ్రమచెందారు. ఒకరి మొగాలొకరు చూచుకొన్నారు. అప్పుడు ముఖ్యులలో ఒక ముసలి ఉద్యోగి సాహసించి లేచి, "రాజా!-మాకు పట్టుకొన్న విచారాన్ని నోటిమాటలతో వెల్లడించలేము. కన్నతండ్రివంటి కృపాసింహుడు తరలిపోయినా, ఈ నిసుగు ఉన్నాడని సంబరపడదామంటే వీలుగాక పోయె! ఇటువంటి పరిస్థితులలో నీవున్నూ విరక్తి చెందితే కుర్రవాని గతి యేంకాను? ప్రజల గతి యేమికాను? ఏవిధంగా చూచినా రాజుతరువాత రాజంతటివాడివి. నీకంటె కుర్రవాడికి పోషకులెవరు? నీవే పోషించాలి. మా మనవి మన్నించు, విరక్తి భావం విడిచిపెట్టు, బిడ్డడిని గద్దెయెక్కించి నీవు పాలించు. ఇలా చేయడంవల్ల అటు రాజు ఆత్మకూ శాంతి చేకూరుతుంది, ఇటు

రాజ్యంలోనూ శాంతి నెలకొంటుంది' అంటూ ప్రాథేయపూర్వకంగా వేడుకొన్నాడు.

దర్బారులో తక్కిన అందరూ ఒక్క మారుగా లేచి, ఏకకంఠంతో "రాజా!— ఆయన చెప్పింది చాలా బాగున్నది. రాజకుమారునిపేర నీవు పాలించటమే మా అందరకూ సమ్మతం" అన్నారు.

అందరి అభీష్టాన్ని తలదాల్చి శక్తి సింహుడు రాజ్యభారం వహించి, పరిపాలన సాగిస్తూవున్నాడు. అతని పరిపాలన జన సమ్మతంగానే ఉంటూపచ్చింది. ప్రతి విషయంలోనూ మంత్రి సామంతులనూ, ముఖ్య ఉద్యోగులనూ సలహాపొంది మరీ ఏపనైనా చేసేవాడు. స్వతంత్రించి ఏదీ చేయక, తను నిమిత్తమాత్రుడుగా మాత్రమే పాలనసాగిస్తూ ఉండేవాడు. ఈ కారణంచేతనే అందరకూ శక్తిసింహుని పైన నమ్మకం కుదిరింది. అతను ఏదైనా పసివాని క్షేమంకోసమే చేస్తున్నాడనే విశ్వాసం బలపడింది.

రాజ్యభారం వహించాడేకాని, శక్తి సింహుని మనసులో ఆ వృద్ధురాలిని గురించిన ఆందోళన తొలగనేలేదు. ఎందుచేత నంటే ఏరోజునైతే రాజ్యభారం వహించాడో




ఆరోజేమొదలు శక్తిసింహుడు కంటినిండా నిద్రపోయి ఎరుగడు. ఎడతెగకుండా పీడ కలలు వస్తుండేవి. ఒక్కొక్కప్పుడు కలలో ఆ వృద్ధురాలు, భయంకరరూపంతో కను పించి హడలగొట్టేది. ఇలా జరుగుతుండటం వల్ల త్వరలోనే ఆ వృద్ధురాలు వస్తుందనీ, తన బండారం బయటపెడుతుందనీ శక్తి సింహుడు భయపడిపోయాడు.

అయితే—అతడు భయపడినట్టుగా ఆ వృద్ధురాలు మళ్ళీ ఆ చాయలకు రానూ లేదు, యదార్థం బయటపడనూ లేదు. కాని శక్తిసింహుడు ఉపాయంకోసం అస్తమానమూ ఆలోచిస్తూనేవున్నాడు.



ఇలా ఆలోచించగా ఆలోచించగా, ఒక నాడు శక్తిసింహునికి ఒక గొప్ప యోచన తట్టింది. వెంటనే ముఖ్యులను సమావేశ పరిచాడు. "బుద్ధిమంతులైన మీకు ఒక అవసర విషయం విన్నవించుకోవలసి వున్నది. మన రాజ్యానికి ఈశాన్యదిశను సుమారు పదియోజనాల దూరంలో ఒక పర్వతగుహ ఉన్నదట. ఆ గుహలో ఒకానొక యోగిపుంగవుడు ఉంటున్నాడట. ఐతే అక్కడికి వెళ్లటం ఒక కష్టం. వెళ్ళినా ఆయన దర్శనం లభించటమూ దుర్లభమే. కాని, ఆ మహానుభావుని దృష్టి పడిందా, ఎటువంటి వ్యాధిఅయినా ఆ సమీపంలో ఉండటానికే వీలులేదట. మీరు అనుమతించినట్టయితే, మన చిరంజీవిని అక్కడికొక్కసారి పంపిద్దామని నాకున్నది. ఏమిటి మీ వుద్దేశం?" అని ప్రశ్నించాడు.

అందుకు ముఖ్యులందరూ ఏకకంఠంతో 'రాజా!—ఇవాళ ఎంత మంచివార్త విన్నాము. మన చిరంజీవికి స్వస్థత చేకూరడమే మనందరకూ కావాలిసింది!! నేడే ఆ మహానుభావుడివద్దకు పంపండి' అని అంగీకారం తెలిపారు.

ఈ అంగీకారం పుచ్చుకొని, శక్తిసింహుడు కాపలావాళ్లనూ, దాదినీ తోడిచ్చి, కొండగుహకు ప్రయాణంకట్టి పంపించాడు. బయల్దేరేటప్పుడు కాపలావాళ్లకు ఏవో రహస్యసంజ్ఞలు చేశాడు.

దేవసింహుణ్ణి తీసుకొని దాదీ, కాపలావాళ్లూ కొద్దిరోజులకల్లా ఒక కీకారణ్యం చేరుకున్నారు. అలసిపోయి వుండటంచేత అందరూ కలిసి ఒక చెట్టునీడని విశ్రమించారు. దాది అక్కడనే పక్కపరిచి, బిడ్డను పడుకోబెట్టింది. తనూ కాస్తంత ఒరిగేసరికల్లా గాఢనిద్ర పట్టేసింది. అలానే కాపలావాళ్లుకూడా తమకు తెలియకుండానే గుర్రుపెట్టేశారు.

ఈ విధంగా నిద్రలో మునిగిన వాళ్లంద రకూ తెల్లవారగానే మెలకువ వచ్చింది. అందరూ కలిసి దాదిని లేపారు. దాది బిడ్డడిని లేపుదామనుకొన్నది. కాని, పసివాడు కన్నులు మూసేవుండటంచేత అప్పుడే లేపడమెందుకని ఊరకున్నది. కాని, ప్రొద్దెక్కినా లేవకపోయె! తట్టి లేపింది దాది. బిడ్డడు ఉలుకూ పలుకూ లేదు!! కంగారుతో అందరనూ కేకవేసిం దామె. అందరూ వచ్చారు, చూచారు. కొయ్యలై పోయారు!!!




పడుకొన్నవాడు పడుకొన్నట్టుగానే ఉండి పోయాడు పసివాడు!!!—శ్వాస ఆడనేలేదు. ఏమిటీ చిత్రం!!—ఒక్కాళ్లకూ ఏమీ పాలు పోలేదు. అంతు చిక్కలేదు. గోలుగోలున విలపిస్తూ వాళ్లందరూ తిరిగివచ్చి రాజు పాదాలపైన పడ్డారు. రాజుకూ ఆశ్చర్య మైంది. క్షణంలో మెరిసిపోయిందీ వార్త!

ఈ విధివైపరీత్యానికి రాజ్యంలో ప్రజ లందరూ నివ్వెరపోయారు. ఏమీ నిశ్చ యించుకోలేకపోయారు, తలకొక విధంగా అనుకొనసాగారు. రాజ్యానికే పీడపట్టుకొన్న దన్నారు కొందరు. ఏమోగాని ఇది వంశ క్షయానికే వచ్చినట్టుందన్నారు మరి కొందరు. అనాథరాజ్యం పేరు నిలిచిపోవలి సిందేకాబోలు నన్నారు ఇంకాకొందరు.

పసివాని మరణానికి శక్తిసింహుడు వెల్లడించిన వగపు ఇంతింత కాదు. అతని దుఃఖం చూచిన ఎవ్వరూ ఈ విషయంలో ఏదైనా కుట్ర జరిగివుంటుందా అని అను మానపడటానికైనా ఎంతమాత్రమూ సావ కాశం లేకపోయింది.

ఐతే - పసివాని మరణం రాజ్యంలో అందరికంటె ఎక్కువగా శక్తిసింహుణ్ణే ఆశ్చర్యంలో ముంచివేసింది. లాంఛన ప్రాయంగా ఆయన దుఃఖం వెల్లడించాడే కాని, ఇంతసులువుగా తన చిరవాంఛితం




నెరవేరటం ఒక అతీతమైన మహిమగా కనుపించింది. తనలో తనుఎంతో ఉప్పొంగిపోయాడు. ఏ పసివాడు వదిలిపోతే తను ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యాన్ని ఏలుకొని సుఖించవచ్చునని తపించిపోయాడో, ఆ నిసుగు కాస్తా రాలిపోయాడంటే, అంతకంటె కావలిసిందేమున్నది?

ఇక తను యిష్టారాజ్యంగా ఉండవచ్చుననుకుని అతడు కులికేటంతలో తలపని తలంపుగా కొన్ని విడ్డూరాలు జరిగినై. తనకు బదులుగా గద్దె యెక్కించి పట్టాభిషేకం చేదామని అనుకొన్న తన పెద్దకొడుకు అకస్మికంగా ఒక అవాంతరానికి గురి అయాడు. ఇక రేపు పట్టాభిషేకం అనగా ఆ కుర్రవాడు దురదృష్టవశాత్తు మేడమెట్లమీద నుంచి జారి పడి, బలమైన దెబ్బతగిలి కుంటివాడయాడు. ఇది జరిగి, నెల తిరగకుండా, తల్లికి ముద్దుబిడ్డడైన కనిష్ఠుడు, ఆరవవాడు పెద్ద జబ్బుచేసి, చచ్చిబ్రతికినంత పనయింది. ఈ రెండుదెబ్బలూ తట్టుకొనేటంతలో, అల్లుడు మతిచెడి దేశాంతరం పోవటంతో ఒక్కగానొక్క కూతురి కాపరం మంటగలిసింది. ఈ విధంగా ఎవరో ఒకరు ఏదో ఒక అపదలో చిక్కుకుంటూనే వున్నారు కాని, కుటుంబంలో ఒక్కళ్ళూ సుఖపడి యెరుగరు.

శక్తిసింహుడు గుండెనిబ్బరం కలవాడే. ఐనా, తన కళ్లయెదట తన కుటుంబం ఇలా కష్టాలపాలవుతున్నదంటే, సహించలేకపోయాడు. ఎన్ని చికిత్సలు చేయించినా బిడ్డలు దారికి రాలేదు. బాలారిష్టాలు తొలగేటందుకు ఎన్నో శాంతులు చేయించాడు. కాని, అతని మనస్సుకు శాంతి చేకూరలేదు. మంచికాలం వచ్చిందని సంబరపడేటంతలో కథ ఇలా అడ్డంతిరిగిందే!

అతని మనసు వికలమైపోయింది. 'తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తా'డనే

పెద్దల వాక్యం నెమరుకు తెచ్చుకొన్నాడు. రాజ్యంలో పేరొందిన జ్యోతిష్కుల నందరినీ పిలిపించి, 'ముందు కథ ఏమిటి?' అని ప్రశ్నిస్తూ, కుటుంబజాతకాలన్నీ వారి ముందు పడవేశాడు.

దైవజ్ఞులు ఆ జాతకాలన్నీ జాగర్తగా పరిశీలించారు. పుట్టలు పుట్టలుగా అంకెలు వేసి గుణించారు. ఎంతగా చూచినా ఆ జాతకాలన్నీ చీకటిమయంగానే కనిపించినై. కాని ఒక్క మెరుగయినా కానరాలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే ఇక కొద్ది కాలంలోనే శక్తిసింహుని కుటుంబం నామ రూపాలు లేకుండాపోయేటట్టు ఆ జాతకాలలో స్పష్టంగా కనిపించింది.

అనుకూలమైన వార్త ఐతే ఒకదానికి నాలుగు కలిపి ఉత్సాహంగా చెప్పవచ్చు గాని, ఇప్పుడున్న పరిస్థితులలో ఓటిమాటలు ఎలా వెల్లడించటం? ఐనా, జాతకం ఎంత పాడుగా వుంటే అంత దివ్యంగా వున్నదని నచ్చజెప్పటం తమ విధి. జ్యోతిష్కులందరూ కూడబలుక్కొని, జాతకాలలో వుండే చెడుగంతా అనుకూలంగా మార్చి రాజుమనస్సుకు నచ్చే తీయని మాటలతో విన్నవించారు.



చెప్పి చెప్పి ఆ దైవజ్ఞులు 'మహారాజా!– త్వరలోనే ఏల్నాటిశని వదిలిపోబోతున్నాడు. వెంటనే ఏలికకు ఒక గొప్ప మహాయోగం పట్టబోతున్నది. దేవర మనసులో తలిచిన కార్యాలేగాక, తలవని కార్యాలుకూడ మరెన్నో జయప్రదంకాబోతున్నవి. గ్రహకూటం చాలా అనుకూలంగా వుంటుంది. నిజానికి ఇటువంటి జాతకం ఇంతవరకు మేమెక్కడా చూచిఉండలేదు...' అంటూ పొగడనారంభించేసరికి, శక్తిసింహుడు ఉబ్బి తబ్బిబ్బులై ఆ జ్యోతిష్కులకు గొప్ప గొప్ప బహుమానాలిచ్చి సత్కరించి పంపాడు. వారు చెప్పిన ఆ మహాయోగం

ఎప్పుడు పడుతుందా అని ఎదురుచూస్తూ వున్నాడు.

ఇన్ని చిత్రాలు జరుగుతున్నా, యిదంతా విధివిలాసమే అని మంత్రి నమ్మలేక పోయాడు. ఇందులో మాయ జరిగివుంటుం దనే సందేహం అతడిని పీడిస్తూనేవున్నది. కాని, ఆధారంలేకుండా ఎలా కలగజేసు కోవటం? పైగా రాజబంధువు అయిన శక్తి సింహుడి విషయంలో అనుమానపడటం కోరి ముప్పుతెచ్చుకొన్నట్టే అవుతుంది.

రాజ్యంలో ప్రజలూ, ప్రజలనుపాలించే ముఖ్యులూ శక్తిసింహుని మాటలను పూర్తిగా నమ్మి, శిరసావహిస్తున్నారాయె. అటువంటప్పుడు 'అది కాదయ్యా ఇది' అని మంత్రి ఒక్కడూ చెబితేమాత్రం ఎవ ళ్ళకు చెవికెక్కుతుంది? కాబట్టి, మాయ బయల్పెట్టి రుజువుచేసి చూపించగల ఆధారం తనకు దొరికేవరకూ పలకకుండా ఉండటంతప్ప గత్యంతరంలేదు.

ఆ వృద్ధురాలెవరోగాని, ఈ సమయంలో ఆమె అయినా వస్తే బాగుండిపోను. కాని, ఆమె రాలేదు. ఆమె వచ్చేవరకూ దాదినీ ఆస్థానవైద్యుడినీ—వాళ్ళు దోషులవునా కాదా అనే సంగతి అటుంచి — కారా గారంలో వుంచే తీరాలె. వేరేమార్గం లేదు.

తనకు శనిరోజులు వదిలిపోయి మంచి కాలం ఎప్పుడు వస్తుందా అని ఒకవంక శక్తిసింహుడు ఎదురుచూస్తున్నాడు. మరొక వంక మంత్రి, ఆ వృద్ధురాలు ఎప్పుడు వస్తుందా, ఎప్పుడు నిజం వెల్లడి అయి తన నమ్మిక బలపడుతుందా అని ఆరాటపడు తున్నాడు.

ఈ ఆరాటంతో మంత్రి ఆ వృద్ధురాలి జాడ ఎలాఅయినాసరే తెలుసుకురమ్మని నమ్మినబంట్లను రాజ్యం నలుమూలలకూ పంపాడు. మంత్రి ఆజ్ఞప్రకారం వాళ్లందరూ గట్టి పట్టుదలతో రాజ్యమంతా గాలింప జొచ్చారు. —(ఇంకా వుంది)






# తమ్మిరాజు తెలివి

గంగరావిపాలెంలో తమ్మిరాజు అనే పెద్ద కాపు ఒకడు ఉండేవాడు. తమ్మిరాజు అట్టే తెలివైనవాడుకాదు. కాని చిత్రమేమిటంటే 'నేను చాలా తెలివైనవాణ్ణి!' అని అతను అనుకుంటూఉండేవాడు.

తమ్మిరాజు పొలంలో పండిన ధాన్యమంతా పొలంలోనే పెద్ద పురికట్టించి దాచాడు. ధాన్యం ఎవరూ ఎత్తుకుపోకుండా రాత్రివేళ పొలంలో పడుకుంటుండేవాడు.

ఆ ఊళ్ళోనే గోవిందు అనే దొంగ ఒకడు ఉండేవాడు. వాడుచేసే దొంగతనాలన్నీ ధాన్యపు దొంగతనాలే. ధాన్యం తప్పితే వాడు మరేదీతాకేవాడేకాదు. పురులు కొయ్యటానికి ఒక కొడవలీ, కోశాక ధాన్యం తోడి ఎత్తుకుపోవటానికి ఒక గోనెసంచీ పుచ్చుకుని అర్ధరాత్రివేళ దొంగతనానికి బయల్దేరేవాడు. వాడు ఎందరి పురులో కోసి ఎన్నిమాట్లో ధాన్యం ఎత్తుకుపోయాడు. కాని ఎన్నడూ ఎవరికీ పట్టుబడలేదు. కాని, తమ్మిరాజు కట్టించిన పెద్దపురి కంటబడేసరికి ఎలా అయినా ఆ రాత్రి దానిపని పట్టాలని గోవిందుకి అనిపించింది.

అర్ధరాత్రివేళ అందరూ గాఢంగా నిద్రపోతూవున్న సమయంలో గోవిందు కొడవలీ, సంచీ పుచ్చుకు తయారై, చప్పుడుగాకుండా పురికోసి, తాను మొయ్యగలిగినంత వరకూ సంచీనిండా ధాన్యం తోడుకుని బుజంమీదకి ఎత్తుకోబోయాడు.

పగలల్లా కష్టపడి పనిచేసిన తమ్మిరాజు ఒళ్ళుమరిచి గుఱ్ఱుపట్టి నిద్రపోతున్నాడు. అతగాడికి మెలకువ రాకపోయేదే కాని, సరీగా ఆ సమయానికే అతని చెవిలో చలిచీమ ఒకటి దూరి గల్లంతుచెయ్యటం మొదలెట్టింది. అందుచేత అతనికి ఒక్కసారిగా మెలకువ రాగా, బస్తాఎత్తుకుంటూన్న గోవిందు స్పష్టంగా కనుపించాడు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మద్రాసు




తమ్మిరాజు త్రాచుపాములాగా లేచి ఒక్క పరుగులో వెళ్ళి అమాంతం వాణ్ణి పట్టివేశాడు.

మరొకళ్లయితే గోవిందుని మెత్తగా చితగ్గొట్టి పంపిద్దురు. తమ్మిరాజు చాలా బలమైనవాడు. గోవిందుని చితగ్గొట్ట తలుచుకుంటే సున్నంలోకి ఎముకలేకుండా చితక కొట్టేసిఉండును.

కాని తమ్మిరాజు అలాగ చెయిచేసుకో లేదు. కారణం యేమిటంటే అతనికి కొంచెం 'లా' తెలుసును. ఏ నేరస్థుణ్ణిఐనా ప్రభుత్వమే శిక్షించాలికాని ఎవరుపడితే వాళ్ళు శిక్షించకూడదని ఎవరో ప్లీడరీ చదువుతూన్న పెద్దమనిషి చెప్పగా తమ్మిరాజు విన్నాడు.

ఇంకా విన్నదేమిటంటే, దొంగసొత్తుతో సహా దొంగ దొరికితే వాడిమీద నేరం సులభంగా రుజువౌతుందనీ, లేకపోతే రుజువుచెయ్యటం కష్టమనీని. గోవిందు దొంగసొత్తుతోనే దొరికేడు గనక వాణ్ణి ఆ సొత్తుతో మునసబువద్దకు తీసుకుపోయి వప్పగించేస్తే, తక్కినచర్య అంతా ఆయనే తీసుకుంటాడనే ఉద్దేశంతో తమ్మిరాజు గోవిందుని తను పల్లెత్తుమాటకూడా అనకుండా, వానితో 'ఎత్తుకో మూట. మునసబు వద్దకు నడు!' అనిమాత్రం అన్నాడు.

నోరెత్తకుండా గోవిందు బస్తాయెత్తుకుని నడిచాడు. తమ్మిరాజు వెంటాడించాడు.

గోవిందు తమ్మిరాజంత బలమైనవాడు కాకపోయినా మాంచి టక్కరి. తమ్మిరాజు వెంగళప్ప అనేసంగతి వాడికితెలుసు. ఎలాగైనా అతగాణ్ణి బుట్టలోపెట్టేసి తప్పించుకోవాలని ఆలోచించాడు.

ఆలోచించి 'కామందులూ! నన్ను తమరు మునసబుగారివద్దకు ఎందుకు తీసుకు వెడుతున్నారు?' అని, ఏమీ ఎరగనివానికి మల్లే అడిగేడు.





అందుకు తమ్మిరాజు, 'నువ్వు ఉత్తి వెంగళప్పవిరా అబ్బాయి! ఈ దొంగసొత్తుతో నిన్ను మునసబుకు వప్పగిస్తే, అతడు లా ప్రకారం నిన్ను ఖైదులో పెట్టిస్తాడు. ఈమాత్రం తెలియకపాయె!' అన్నాడు, అక్కడికి మహా తనకే తెలిసినట్లు.

ఈమాటకు గోవిందు, "బాబూ, ఇది దొంగసొత్తు అని మునసబుగారికి రుజువు ఎలాగవుతుంది, చెప్పండి? 'ఈమూటనాచేత కూలికి మోయిస్తున్నారు. నేను దొంగిలించ లేదు' అని నేను వారితో చెపుతాననుకోండి. అప్పుడాయన నన్ను వదిలిపెట్టెయ్యవచ్చు కదా! అటువంటప్పుడు మీరేంచేయగలరు?" అన్నాడు.

ఈమాటలు వినేసరికి తమ్మిరాజుకు 'నిజమే' అనిపించి, 'అలాగైతే ఇది దొంగ సొత్తు అని నిరూపించటం ఎలాగరా, మరి?' అని గోవిందునే సలహా అడిగేడు!

అందుకు గోవిందు, "ఎలాగేమిటి కామందుగారూ! నా కొడవలిని మునసబు గారికి చూపించి, 'దీనితో వీడు పురికోశాడు' అని చెప్పండి" అన్నాడు.

వాడి ఆలోచనకి మెచ్చుకుని, 'ఏది నీ కొడవలి?' అన్నాడు తమ్మిరాజు.

అప్పుడు గోవిందు, 'అయ్యో!-కొడవలి నేను పురిదగ్గరే మరిచిపోయాను; ఉండండి, ఒక్క పరుగులో వెళ్ళి పట్టుకు చక్కా వస్తాను!' అంటూ ఆమూట అక్కడ పడేసి గబగబా పరుగెత్తేడు.

అప్పుడేవస్తాడు, ఇప్పుడే వస్తాడు అని చెప్పి తమ్మిరాజు తెల్లవారేవరకూ గోవిందు కోసం అలానే ఎదురుచూస్తూ కూర్చు న్నాడు. తమ్మిరాజు తెలివిగాని, పారిపోయిన గోవిందు మళ్ళీ వస్తాడా? రానే లేదు. కాపుకి కోపంవచ్చి, ఆమూటను మునసబుకి చూపించి జరిగిన సంగతంతా చెబుదామను కున్నాడు. కాని 'లా' తెలిసిఉన్నవాడా



యిరి! దొంగ లేందే అది దొంగసొత్తు అని రుజువుచెయ్యటం ఎలాగ? అందుచేత అతడు ఆ ప్రయత్నం మానేసి, తన మూట తనే నెత్తినిపెట్టుకుని 'దేముడా!' అంటూ మోసుకుపోయాడు.

ఇలా మరొక ఆరునెలలు గడిచాయి. తమ్మిరాజు ఏదో ఊరువెళ్లేడనీ పదిరోజులకి కాని రాడనీ తెలిసింది గోవిందుకి. మళ్ళీ ఒకనాటిరాత్రి అతని పొలంవెళ్ళి పురికోసి సంచీలో ధాన్యం ఎత్తుకుంటున్నాడు. కాని వాడి ఖర్మంకాలి, తమ్మిరాజు అనుకున్న గడువుకంటే ముందుగానే వచ్చేశాడు. వచ్చినవెంటనే ఆత్రంతోవున్న తమ్మిరాజు పొలంవెళ్లి, ధాన్యాన్ని సంచీలో పట్టుకుంటూవున్న గోవిందుని చూశాడు.

'ఆరి దుర్మార్గుడా, మళ్ళీ వచ్చావా?' అంటూ వాణ్ణి పట్టేసి, ఇదివరకులాగే మూట నెత్తినిపెట్టించి, మునసబువద్దకు నడవమన్నాడు.

గోవిందు సగందూరం వెళ్ళేక ఏదో మరచినట్టు గభాలున వెనక్కి తిరిగి, 'అయ్యో ఎంత మందమతిని! నా కొడవలి మళ్ళీ పురిదగ్గరనే పెట్టేసివచ్చా. పెదకాపు గారూ, వెళ్ళి ఒక్కనిమిషంలో పట్టుకొచ్చేస్తాను ఉండండి!' అని మూట దింపుకో బోయాడు.

ఇందుకు తమ్మిరాజు, 'అవేళ నీమాట నమ్మి మోసపోయాను. ఇప్పుడుకూడా నమ్మి నిన్ను వదలటానికి నేనేమంత వెంగళప్పనుకానురా గోవిందూ! నేనే వెళ్లి ఆ కొడవలి తెస్తాను! నువ్విక్కడే ఉండు' అంటూ పురివైపు చరచరా వెళ్ళేడు.

అతడు వెళ్లగా చూచి గోవిందు, 'ఇది మరీ బాగుంది. ఈమాటు నాకు ధాన్యం సులువుగా దక్కేయి!' అని సంతోషిస్తూ, ఆ మూటతో మాయమయ్యాడు. ఈవిధంగా గోవిందు గట్టితనమూ, తమ్మిరాజు తెలివి తక్కువా రెండుసార్లూ వెల్లడి ఐంది.






చెన్నపట్టణంలో సింగారవేలు అనే టాక్సీవాలా ఒకడు ఉన్నాడు. వాడికి రెండు దుర్గుణాలు ఉండేవి. మొదటిది ఏమిటంటే, వాడి టాక్సీ ఎక్కి వెళ్ళినవాళ్ళు మీటరు లెక్కప్రకారం వాడికి ఛార్జీ ఇస్తే సరిపోక, పేచీపెట్టి రూపాయో అర్ధో గుంజుకోవడం.

రెండోదుర్గుణం ఏమిటంటే, సామానులు అన్నీ దించక ఏదో ఒకటి కార్లో అట్టే పెట్టేసుకోవడం. ఆ ఎక్కినవాళ్ళు జాగ్రత్తయిన వాళ్ళయి, సామానంతా దిగిందా లేదా అని చూసుకునేవాళ్లయితే సింగారవేలు 'అయ్యో, ఈమూల ఈసామాను ఉండిపోయిందే; నేను చూసుకోనేలేదు!' అంటూ ఏమీ ఎరగనట్లు నాలిక కరుచుకుని, వెంటనె ఆ సామానుకూడా దించేసేవాడు. వాళ్ళు ఏమాత్రం ఏమారివున్నా వాళ్ళ కళ్ళలో దుమ్ముకొట్టి సామాను కొట్టేసేవాడు.

ఒకనాడు బెజవాడనుంచి సంగమేశ్వరరావు అనే ఆయన సకుటుంబసమేతంగా రైలులోవచ్చి చెన్నపట్నం సెంట్రల్‌స్టేషన్లో దిగేడు. ఆయన భార్యా తమ్ముడు, వెంకటాచలం అనే క్రిమినల్ లాయరు, ట్రిప్లికేనులో సింగరాచారివీథిలో మకాంచేసి వుంటున్నాడు.

సంగమేశ్వరరావు కంటపడటంతోనే సింగారవేలు "టాక్సీసార్!" అని, ఆయన ఏమీ సమాధానంచెప్పకుండానే ఆయన సామాను ఎక్కించేసి, "అమ్మగారూ ఎక్కండీ" అన్నాడు. వాళ్లంతా ఎక్కడంతోనే, "ఎక్కడికి సార్?" అని సింగారవేలు అడగటం, సంగమేశ్వరరావు బావమరది అడ్రస్సుచెప్పటం జరిగింది.

టాక్సీ వెంకటాచలంగారింటిముందు ఆగటంతోనే చుట్టాలంతా దిగి లోపలికి వెళ్ళేరు. వాళ్లని ఇంట్లోవాళ్ళు కుశల

ఆర్. వైదేహి - బాపట్ల



ప్రశ్నలు అడుగుతోంటే సింగారవేలు సామాను చేరవేసి, ఛార్జీ అడిగాడు.

సంగమేశ్వర్రావు మీటరుచూపిన ఛార్జీ ఇవ్వబోయేసరికి సింగారవేలు ఖస్సుమని, "తిరిగిపోయేటప్పుడు ఖాళీగా పోవాలే. మీటరుఛార్జీమాత్రం ఇస్తే ఎలాగ?" అని పేచీ పెట్టేడు. సంగమేశ్వర్రావు మరో రూపాయి వాడిచేతిలోపడేసి, వెళ్లమన్నాడు.

సింగారవేలు సణుక్కుంటూ టాక్సీని డ్రైవుచేసుకుపోయాడు.

భోజనాలయాక సంగమేశ్వర్రావు ఏదో వెతుక్కోబోగా, అయన బావమరది వెంకటాచలం 'ఏమిటిబావా?' అన్నాడు.

'చెప్పులజతవున్న అట్టపెట్టె కనపట్టం లేదోయ్. మొన్న హైదరాబాదులో మనసు పడి కొన్నాను' అన్నాడు సంగమేశ్వర్రావు.

ఆయనభార్య, 'రైలుదిగినప్పుడు నేను చేత్తో పుచ్చుకున్నానండీ టాక్సీలో వదిలేరేమో!' అంది.

'సాయంత్రం స్టేషనువైపు వెళ్లిచూద్దాం. ఇలా మరిచిపోయిన సరుకులేమైనావుంటే వాళ్ళు జాగ్రత్తపెట్టి ఇవ్వడంకలదు' అన్నాడు బావమరిది వెంకటాచలం.

సాయంత్రం బావమరదు లిద్దరూ స్టేషన్లో టాక్సీస్టాండుపద్దకు వెళ్ళేరు. అక్కడ సింగారవేలు కనపట్టంతోనే 'ఏమోయ్, పొద్దున్న టాక్సీలో కొత్త చెప్పులున్న అట్టపెట్టె ఒకటి దిగడిపోయింది' అన్నాడు వెంకటాచలం.

సింగారవేలు ఏమీ ఎరగనివానికిమల్లే, 'ఏమీలేదే. అమ్మగారు సామాను అంతా సరిచూసుకున్నారు' అని బొంకాడు.

సంగమేశ్వర్రావు కారంతా ఓమాటు గాలించాడు. వెతికితే కనపడటానికి ఆ జోళ్లపెట్టె ఇంకా అక్కడ కూచుందా? దాన్ని కారులోనే ఉంచటానికి సింగారవేలు తెలివితక్కువవాడా?

సింగారవేలుమీద పోలీసులకి రిపోర్టు ఇద్దామనిపించింది వెంకటాచలానికి. కాని సంగమేశ్వర్రావుగారు, 'పోనిద్దూ, అజాగ్రత్తగా ఉండటం మనదే తప్పు. పోయిన వస్తువు చెప్పులజోడు అంటే పోలీసువాళ్ళు కూడా అంత లక్ష్యపెట్టరు. ఇంక కేసుపెట్టి ఏంప్రయోజనం?' అనిచెప్పి, ఆ ప్రయత్నం మానిపించేశాడు.

సంగమేశ్వర్రావు చెన్నపట్టణంలో ఒక వారంరోజులుండి కుటుంబంతో సహా బెజవాడ తిరిగి వెళ్ళిపోయాడు. ఆ దరిమిలా ఒకనాడు రాత్రి వెంకటాచలం, అడయారు గాంధీనగరంలో స్నేహితుడొకాయన గృహప్రవేశమై విందుకి పిలుస్తే, అక్కడికి వెళ్ళేడు. తిరిగివస్తో బస్సుకోసం స్టాండులో నిలబడితే ఎంతసేపటికీ బస్సు రాలేదు. ప్రాణంవిసిగి 'ఏంచేద్దామా?' అనుకునే సరికి టాక్సీ ఒకటి అవారినిపోతో ఆయన్ని చూసి ఆగింది.

"రండిసార్!" అన్నాడు డ్రైవరు.

మరొకప్పుడైతే వెంకటాచలం పొమ్మనే వాడేగాని రాత్రి తొమ్మిది దాటిపోవటం, పైన చినుకులుకూడా ప్రారంభించడం చూసి త్వరగా ఇంటికి చేరుకోవడమే మంచి




దనిపించిందాయనకి. కార్లో కూచుని "ట్రిప్లికేను పోనియ్యవోయ్" అన్నాడు.

మొదట ఆనవాలుకట్టకపోయినా, కారు కొంతదూరం పోయేసరికి వెంకటాచలం గారికి ఆ కారుడ్రైవరెవరో తెలిసిపోయింది. సంగమేశ్వరరావుగారి జోడుకొట్టేస్త వాడే అని ఆయన పోల్చుకోడంతోనే వాడికేదైనా తగినశాస్తిచేసి ఏడిపించా లనిపించింది. వాడిది ఇతరులసొమ్ము అంటే గడ్డితినేబుద్ధి అని ఆయనకు తెలుసు గనక వాణ్ణి టోకరా కొట్టించటానికి ఆయన ఒక ఎత్తువేశాడు.

ఒక వంద గజాలలో తమయిల్లు వస్తుందనేవరకూ టాక్సీని పోనిచ్చి 'డ్రైవర్,

టాక్సీలో ఎక్కడో నా పర్సు పడిపోయింది. ఏమూలకి పోయిందో ఎంతతడిమినా చేతికి తగల్లేదు. అగ్గిపెట్టెవుంటే ఇయ్యి, వెలిగించి చూస్తాను!' అన్నాడు.

సింగారవేలుదగ్గిర అగ్గిపెట్టె లేకపోలేదు. కాని వాడికి దాన్ని ఇవ్వ బుద్ధివెయ్యలేదు. ఏమంటే పర్సుమాట చెవినిపడ్డంతోనే వెంకటాచలం అనుకున్నట్లే వాడికి దురాశ పుట్టి దానినింక ఆయనకు దక్కనివ్వ కూడదనిపించింది. వాడి మెదడు వెంటనే పనిచేసి ఆయనను మోసంచెయ్యటానికి తగిన ప్లాను ఇట్టే తోచింది.

వాడు, 'సార్, నావద్ద నిప్పుపెట్టెలేదు. అదిగో ఆ సందులో ఒక కిల్లీకొట్టు ఉంది. అక్కడ అగ్గిపెట్టెలు అమ్ముతాయి. నేనే వెళ్లి తెచ్చిపెడుదునుగాని, ఇంజను ఆపేస్తే కారు మళ్లీ ఓపట్టాన కదలదు! మీరే దయ చేసి ఒక్క అడుగు వెళ్లివస్తారా?' అన్నాడు. అంతేగాదు 'పర్సు పడిపోయిందిగనక మీవద్ద వేరేచిల్లర ఉండదు' అంటూ వాడు తన జేబులోంచి ఒక అణాకూడా తీసియిచ్చి ఆయనచేతిలో పెట్టేడు.

వెంకటాచలం టాక్సీదిగి వాడుచెప్పిన సందులోకి నడిచాడు.

ఆయన అనుకున్నట్లే సింగారవేలు ఆయనవెళ్లగాచూసి వెంటనే బ్రేకు వదులు చేసి నలభైమైళ్ళ స్పీడున టాక్సీతో పారి పోయాడు. షెడ్డుచేరేవరకూ సింగారవేలు మళ్ళీ ఎక్కడా టాక్సీని ఆపలేదు. అక్కడకు చేరేక, ఆ పర్సుకోసం తన టార్చి లైటుతో కారు అంతా గాలించాడు.

పర్సు అనేది ఉంటేగా కనపడటానికి? ఈ లేనిపర్సుకోసం ఆశపడి నిష్కారణంగా ఛార్జీ పోగొట్టుకున్నాడు! పైగా సొంతసొమ్ము కూడా ఒక అణా వదిలింది! అందుకని తేలుకుట్టిన దొంగలాగా సింగారవేలు లోలో పలే ఒకరాగంపెట్టి ఊరుకున్నాడు. మరి, అంతకంటె చేసేదేముందీ?





# గంధర్వకన్యలు

ఒక పల్లెలో పాపమ్మఅనే పేదరాలికి జోగూ, నాగూ అని యిద్దరు పిల్లలు. చిన్నప్పుడే వాళ్లకు తండ్రి పోవటంచేత పిల్లలను పోషించే భారమంతా ఆమెపైనే పడింది.

అది చాలా చిన్నపల్లె. దగ్గర్లో చిన్న అడవీ, దూరంగా పెద్ద కొండలూ కనబడు తూంటవి. పాపమ్మ పొద్దస్తమానమూ ఆ అడవిలో మూలికల్నీ, ఔషధానికి పనికివచ్చే ఆకుల్నీ ఏరి, ఆ గ్రామంలోని వైద్యుడికి తెచ్చియిచ్చేది. అతడిచ్చే తృణమో పణమో పుచ్చుకొని అలాగే కాలంగడుపు తుండేది.

జోగూ, నాగూ పదహారు, పన్నెండు సంవత్సరాల వయసువాళ్లయారు. మూలి కల్ని తవ్వడంలో, ఔషధాలకు ఉపకరించే ఆకుల్ని కోయడంలో, తల్లికి సాయపడే వాళ్ళు. ఒకనాడు వైద్యుడు ఏదో మూలిక కావాలంటూ, దానికి సంబంధించిన గుర్తు లను చెప్పి తీసుకురమ్మన్నాడు. జోగూ, నాగూ అడవి అంతా గాలించినా అది దొరకలేదు.

దూరంగావుండే ఆ కొండల్లో అవి దొరుకు తాయని తల్లి చెప్పింది. మరునాడు వుద యమే కాలినడకను వాళ్లు బయలుదేరారు. సూర్యుడు నడుమధ్యకు చేరేప్పటికి, వాళ్ళూ కొండలమధ్యకి చేరారు.

మంటలురేపుతున్న ఎండలో, పొగలు గక్కుతున్న ఆ బండరాళ్ళమధ్య యిద్దరూ మూలికలకోసం వెతికారు. మెల్లగా సూర్యుడు అస్తమించేసరికి తెచ్చిన రెండు సంచుల్నీ వాళ్ళు మూలికలతో నింపారు.

జోగు చెమటతుడుచుకుని, ఒళ్ళు విరుచుకుంటూ "నాగూ! ఇక యింటికి బయలుదేరదాం" అన్నాడు. అప్పటికే ఓ బండకు వీపు ఆనించి అపసోపాలు పడు తున్నాడు నాగు.

డి. హైమవతి - జబల్పూరు




"ఈరాత్రికి యిక్కడే నిద్దరపోతే ఏం?" అన్నాడు నాగు.

జోగుశరీరం గొంగళిపురుగు పాకినంతగా కంపరం యెత్తింది. "ఈ కొండలమధ్య రాత్రి ఎలా గడపడం! పురుగూ పుట్రా! ఊc—లే!" అన్నాడు కోపంగా.

నాగుకు కునికిపాట్లమధ్య ఎవరో కుదిపినట్టయింది. "ఊహుc! నిద్దరొస్తోంది. బయలుదేరవచ్చులే, కాసేపాగు" అన్నాడు మత్తుగా.

జోగుకు తమ్ముడంటే అమితమైనప్రేమ. వాడి వొళ్ళువిరుపూ, కునికిపాట్లూ చూచి జాలికలిగింది. కాసేపు అగే బయలుదేరవచ్చని తనూ పక్కగా మరోబండకు చేరగిలబడ్డాడు.

మనం నిద్రపోతున్నామని కాలమూ నిద్రపోతుందా! ఊహుc! కాలానికి అలుపూ అయాసమూ లేదు. ఎవళ్లకోసమూ నిలవకుండా దానిమానాన అది నడుస్తూనే వుంటుంది.

సూర్యుడు దిగిపోయాడు. చంద్రుడు పైపైకి ఎగబ్రాకాడు. దూది ఎండవేసినట్టుగా వెన్నెల. పగలల్లా ఎండలో పనిచేసిన జోగూ - నాగులు కళ్ళుమూయటమే తడవుగా నిద్రలోకి జారుకున్నారు. తెల్లని వెన్నెలా, చల్లని పైరుగాలీ, చీమ చిటుక్కుమనేటంత నిశ్శబ్దం; అన్నాదమ్ము లిద్దరికీ జోలపాడేసింది.

పావురాలు రెక్కలు కదిలించినలాంటి చిన్న, మృదువైన శబ్దం! దానికే నాగు పులిక్కిపడి కళ్లు తెరిచాడు. వాడికి రాత్రిళ్లు అమ్మపక్కన లేందే నిద్రపట్టదు. అంతభయం. "అన్నా! అన్నా!" అని మెల్లిగా జోగుభుజం గీకాడు. జోగు బిత్తరగా కళ్ళు తెరిచాడు.

"వెన్నెలకూడా వచ్చేసిందిరా నాగూ!" అన్నాడు జోగు భయంగా. యిక రాత్రికి

అక్కడే కాలంగడపాలనే భయం జోగును హడలకొట్టింది.

"అదికాదురా! ఏదో కదులుతున్నట్టు వినబడింది. సింహమో, పెద్దపులో" అన్నాడు నాగు.

"సింహాలూ, పులులూ ఇక్కడ లేవులే! కోతో కొండముచ్చో అయివుంటుంది!" అన్నాడు జోగు భయంగా.

ఇద్దరూ ఆ వెన్నెట్లో చుట్టూ చూశారు. ఎదురుగావున్న ఓ పెద్ద రాయివెనకనుంచి యీసారి పెద్దగా ధ్వనివచ్చింది. నాగు ఒక్క పరుగులో జోగుమెడ పుచ్చుకుని "అన్నా! అన్నా!" అన్నాడు.

అదే సమయంలో శ్రావ్యమైన చిన్న పెద్ద నవ్వులు ఆ రాతిపైనుంచి ప్రతిధ్వనించినై.

జోగు సగంభయం పోగా తలఎత్తి అటు చూచాడు. నాగు భయంభయంగా కొంచెం తలయెత్తి సగంకళ్ళు తెరిచాడు. యిద్దరి దృష్టినీ ఆ నవ్వులూ, ఆ రాతివెనక కదిలే అందమైన మొహాలూ ఆకట్టుకున్నై.

మరునిమిషానికి, ఆ రాతివెనుకనుంచి అనేకమంది గంధర్వకన్యలు వాళ్ల దగ్గర కొచ్చి ఆగారు. అందమైన మొహాలూ, కిలకిల




మనే నవ్వులూ జోగునూ, నాగునూ స్తిమితపరిచినై.

జోగూ, నాగూ లేచి నిలబడ్డారు. గంధర్వకన్యలు బొంగరాలలాగా వాళ్ళిద్దరి చుట్టూ తిరుగుతూ నాట్యం చేయసాగారు. సోదరు లిద్దరూ భయంపోయి, ఆనందంతో చప్పట్లు చరిచారు. "ఎంత అందమైన పిల్లలు!" అన్నాడు జోగు. "ఎంచక్కా ఆడుతున్నారు!" అన్నాడు నాగు.

ఆ మాటలతో నాట్యం ఆగిపోయింది: పాటలూ ఆగిపోయాయి. గంధర్వ కన్యలు అన్నదమ్ములచుట్టూ నిలబడి ఆమాటా యీమాటా అనసాగారు.




"మా వూరు వస్తారా? చాలా బావుంటుంది!" అన్నది ఓ గంధర్వకన్య.

"ఓ! వస్తాం. అయితే దారెటు?" అని అడిగాడు నాగు.

తొందరపడవద్దని జోగు తమ్ముణ్ణి చేత్తోనే వారించాడు.

"అదే మా వూరుకు దారి!" అని ఓ గంధర్వకన్య వేలుతో చూపింది.

జోగూ, నాగూ అటు చూచారు. ఒక అద్భుత దృశ్యం! వాళ్ల కళ్లు ఆ అందానికి జిగాలుమన్నై.

"అది యింద్రధనస్సులా వుందే!" అన్నాడు జోగు.

"ఇంద్రధనస్సు కాదు. మా వూరుకూ, యీ కొండలకూ మధ్య వంతెన" అన్నది గంధర్వకన్య.

"వెళ్దామా?" అని అడిగాడు నాగు, జోగును.

"ఏమో!" అంటూ సంశయించాడు జోగు.

ఇదంతా వింటున్న గంధర్వ కన్యలు అన్నదమ్ముల చేతుల్ని మృదువుగా పట్టుకుని, ఆ యింద్రధనస్సులా వున్న వంతెన మీదుగా తమ దేశంలోకి తీసుకుపోయారు.

అన్నాదమ్ములల ఆనందానికి హద్దులు లేకుండా పోయినై. వాళ్ళు విన్న శాస్త్రాల్లో, కన్న కలల్లో మాత్రమే వున్న, అన్ని అందాలూ, ఆనందాలూ అక్కడ వాళ్ళు చూడగలిగారు. రోజులూ, నెలలూ, సంవత్సరాలే గడచిపోతున్నా, వాళ్లకు ఇంటిధ్యాసగాని, అమ్మతలపుగాని కలగలేదు. గంధర్వ కన్యల అందమైన మొహాలూ, కమ్మని పాటలూ, తియ్యని మాటలూ వాళ్లు సర్వం మరిచిపోయేట్లు చేసినై.

ఓనాడు జోగూ, నాగూ ఆ గంధర్వ లోకంలోని కొండల్లో యీలలు వేసుకుంటూ షికారువెళ్తున్నారు. హఠాత్తుగా నాగుదృష్టి

దారిపక్కన దుబ్బుగా పెరిగిన ఓ చిన్న చెట్టుమీద పడింది. "అన్నా! ఇలాంటి చెట్టు మనం ఎక్కడో చూశామే!" అన్నాడు నాగు, జోగుతో.

జోగుకు వెంటనే గుర్తుకొచ్చింది. ఆ చెట్టూ, ఇంకా కొన్ని మూలికలకోసమే తనూ, తమ్ముడూ యింటినుంచి బయలు దేరామని.

తామూ తల్లీ గ్రామాలకూ కొండలకూ వెళ్లడం, మూలికలు వెదకటం అంతా నిన్ననో మొన్ననో జరిగినట్టుగావుంది. "అమ్మ ఏమనుకుంటూ వున్నదో? రాత్రికి తిరిగిరాకపోతే బెంగపెట్టుకోదూ?"

ఈ ఆలోచన యిద్దరికీ బాధ కలిగించింది. సరాసరి గంధర్వకన్యల దగ్గరకు పోయి "ఇక్కడికి మేమువచ్చి యెంతకాల మైంది?" అని అడిగారు.

గంధర్వకన్యలు నవ్వి "మీ దేశంలో మల్లే మా దేశంలో కాలం కొలిచేందుకు గడియారాలూ అవ్వీ లేవు" అన్నారు.

"అయితే, మాదేశం వెళ్తాం!" అన్నారు యిద్దరూ.

"ఏం! ఇక్కడ బాగాలేదా?" అన్నారు గంధర్వకన్యలు.



"బాగానేవుంది! కాని, మేము తీసుకు పోవలసిన మూలికలమాటే మరిచిపోయి ఇక్కడ కాలయాపన చేశాం. ఇక వెళ్లాలి" అన్నారు.

ఎంతచెప్పినా లాభంలేకపోగా, గంధర్వ కన్యలు జోగూ, నాగుల్ని ఆ ఇంద్రధనస్సు లాంటి వంతెనమీదుగా తిరిగి యీలోకానికి దించారు. జోగూ, నాగూ సాయంకాలాని కల్లా మూలికలున్న సంచీలతో యింటిని సమీపించారు.

వాళ్లయిల్లు వాళ్ళే గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. కప్పు కూలిపోవడానికి తయారుగా వుంది. ద్వారబంధాలూ, తలు

పులూ పుచ్చిపోయి, చెక్కలు ముక్కలుగా రాలిపోతున్నై. వాళ్ళు ఆశ్చర్యంతో అన్నీ చూస్తూ తలుపుతట్టారు.

"ఎవరుబాబూ!" అంటూ వణుకుతున్న గొంతుతో ఓ వృద్ధురాలు తలుపుతెరిచింది. ఓక్షణం రెప్పవేయకుండాచూచి "మీరా! నా నాన్నలు! బాబులు! పన్నెండు సంవత్సరాలు గడిచినా, ఆ వెళ్ళినరోజున ఎలా వున్నారో, అలాగేవున్నారు!" అంటూ కౌగలించుకుంది.

జోగూ, నాగూ వెక్కివెక్కి ఏడ్చారు. గంధర్వకన్యల అందచందాలకు మోసపోయి కన్నతల్లికి కలిగించిన బాధ గ్రహించారు. "ఇవిగో యీ సంచుల్లో మూలికలున్నై. చాలాతెచ్చాం!" అంటూ తల్లిచేతికి వాటిని అందించారు.

"ఇన్ని సంవత్సరాలతరవాత యింకా ఆ మూలికల వుపయోగం ఏముంటుంది నాయనా! అవి ఎండిపోయివుంటై. మీరు తిరిగివచ్చారు. అంతే చాలు!" అంటూ పాపమ్మ ఆ సంచులను అందుకుని లోపలకు చూచింది. ఆమెకు అక్కడ మెరుస్తూన్న ముత్యాలూ, రత్నాలూ కంటబడినై. ఆశ్చర్యంతో సంచిలో చేయిపెట్టి ఒక గుప్పెడు బయటికితీసింది. ఎండిపోయిన ప్రతి మూలికకూ, ఆకుకూ నిండుగా ముత్యాలూ, రత్నాలూ గుచ్చబడివున్నై. అంతవరకూ ఆసంగతి తెలియని జోగూ నాగూకూడా వుప్పొంగిపోయారు.

పాపమ్మ కళ్ళవెంట ఆనందాశ్రువులు రాలినై. ఇద్దరు కొడుకులనూ గట్టిగా కౌగలించుకొని ముద్దాడింది.

ముత్యాలూ, రత్నాలతో తిరిగివచ్చినందుకు అమ్మ ఆనందపడుతున్నదని జోగూ, నాగూ అనుకున్నారు గాని, ప్రాణాలతో తిరిగివచ్చిన కన్నబిడ్డల్ని చూచుకొని తల్లి ఎక్కువగా ఆనందపడుతున్నదని, ఆ పసివాళ్లకు తెలీదుకదా!






బెబ్బులి - రైతు రామన్న యింటి కాపలా కుక్క. ధైర్యసాహసాలకూ, విశ్వాసానికీ దాని కదేసాటి. ఒకనాటి వుదయం బెబ్బులి పక్కనవున్న అడవికి షికారుపోయింది. అటూయిటూ తిరుగుతున్నప్పుడు, ఒక తుప్పచాటున కూర్చునివున్నతోడేలూ, దాని పక్కనే ఒక నక్కా కంట బడినై.

బెబ్బులి తక్కున వెనుదిరిగింది. అలా తిరగటం అవంటే భయపడికాదు; వాటి చూపూ, కూర్చున్నతీరూ, బెబ్బులికి ఎంతో అసహ్యం కలిగించినై. "అన్నయ్యా ఆగు! ఒక చిన్నసంగతి" అని నక్క కేకవేసింది. ఆ కేకవినగానే బెబ్బులి వెనుదిరిగి తోడేలూ, నక్కా కూర్చున్నచోటుకు వెళ్ళింది.

నక్క తోకాడించి, చెవులు టపటపకొట్టి ఇలా చెప్పటానికి ప్రారంభించింది: "తోడేలుఅన్నా నేనూ మన కుటుంబవిషయాలే చర్చిస్తున్నాం. తెలుసునో లేదో, మనంమనం అంతా దాయాదులం. చాలా కాలం కిందట మీ శాఖవాళ్లంతా మనుషులతో పరిచయంచేసుకుని గ్రామాల్లో పట్టణాల్లో నివాసం ఏర్పరుచుకున్నారు. తోడేలు అన్నయ్యాశాఖవాళ్లూ, మావాళ్ళూ, అడవుల్లోనే వుండిపోయారు. పోతే, చలిఎక్కువ కావడంవల్ల తోడేలుఅన్నయ్యా శాఖవాళ్లంతా వొంటినిండా బొచ్చుపెంచుకుంటే, మేము గుంటల్లో బొరియల్లో నివసింపసాగాము. అసలింతకూ చెప్పదలచుకున్నమాట యేమిటంటే, మనంమనం దాయాదులం! అన్నాదమ్ములం!" అన్నది.

తోడేలు 'అవు' నంటూ జల్లితోక కిందికీ పైకీ తిప్పింది. బెబ్బులికికూడా ఆమాటల్లో ఎంతో నిజం కనబడింది. "అయితే వీలైనప్పుడు మాయింటికి ఓమారు రండి!" అని తోడేలునూ, నక్కనూ ఆహ్వానించింది బెబ్బులి.

వై. కోటేశ్వరశర్మ - టెక్కలి




ఆరాత్రి చీకటిపడగానే తోడేలూ, నక్కా బెబ్బులియింటికి వచ్చినై. యజమాని తన కోసం పెట్టిన ఆహారంలో బెబ్బులి వాటికి భాగంయిచ్చి సత్కరించింది. తరవాత అమాటా యీమాటా మాట్లాడి కృతజ్ఞత తెలియపరిచి తోడేలూ, నక్కా వాటివాటి ఇళ్లకు వెళ్ళిపోయినై.

తెల్లవారింది. బెబ్బులి రైతురామన్న యింటివాకిట అటూయిటూ తిరుగుతోంది. హఠాత్తుగా పక్కయింటి యిల్లాలు లబో దిబోమంటూ ఏడవసాగింది. ఐతే, అమె ఎందుకలా ఏడుస్తున్నదీ అని అడగవచ్చు. రాత్రి యింటిచూరుకింద కమ్మివేసిన రెండు కోళ్ళు ఐపూ అజాలేకుండా పోయినై. దొడ్లో కట్టివేసిన గొఱ్ఱెపోతు హస్తిపంజరంమాత్రమే మిగిలివున్నది.

బెబ్బులికి ఆశ్చర్యంవేసింది. కోళ్ళనూ గొర్రెనూ ఎవళ్ళు ఎత్తుకుపోయివుంటారా అనే సమస్య తేల్చుకోలేక మనసులో మథనపడసాగింది. తను ఎంతో విశ్వాసమైన జంతువు అనే సంగతి తనకు తెలుసు. తన దాయాదులైన నక్కా, తోడేలూ కూడా చాలా మంచివాళ్లని దాని దృఢనిశ్చయం. మరి అటువంటప్పుడు, ఇటువంటిపని చేసిన అ దుర్మార్గులు ఎవరైవుంటారు? అని ఆలోచనలో పడింది బెబ్బులి.

చీకటిపడింది. తోడేలూ, నక్కా మామూలుగా వచ్చినై. బెబ్బులి తన ఆహారంలో భాగమిచ్చి సత్కరించి, వాటితో యిలా అన్నది: "యికనుంచి మీరు యిక్కడికి రాదలిస్తే పగటిపూటే రండి."

అందుకు తోడేలూ నక్కా జంటగొంతులలో 'అబ్బే! పగటిపూట వచ్చేందుకు మాకు తీరుతుం దనుకున్నావా!' అన్నవి.

తెల్లవారింది. పక్కయింటిలో బ్రహ్మాండం బద్దలయ్యేలా కేకలు! రైతురామన్నకూడా అరుస్తున్నాడు. మూడు బాతులు, ఒక

మేకపిల్లా అంతులేకుండా పోయినై. మిగిలిందల్లా అటూయిటూ గాలిలో ఎగిరే బాతు యీకలూ, మేకపిల్లగిట్టలూ, డొక్క ఎముకలూ—ఇవిమాత్రం అగపడుతున్నై.

బెబ్బులి గ్రహించింది. తన తెలివితక్కు వకు చాలా చింతించింది. యజమానికి నిజంగా తను ద్రోహంచేశానని బాధపడింది. చీకటిపడుతూవుండగానే భాగంయిచ్చి సమయంకోసం కాచుక్కూచుంది.

బెబ్బులి సత్కారానికి ఎన్నో ధన్య వాదాలు పలికి, తోడేలూ నక్కా బయలు దేరినై. వాటికి కనబడకుండా బెబ్బులి వెనకనే బయలుదేరింది. అది చూస్తూ వుండగానే తోడేలు వామిపక్కన పడుకున్న గొఱ్ఱపిల్లను నోటకరుచుకుంది. బెబ్బులికి పట్టరానంతకోపం వచ్చింది. పెద్దగా అరుస్తూ తోడేలుమీదకు దూకి కలియబడి గొఱపిల్లను విడిపించింది.

ఆ పక్కనే కోళ్లగూట్లో జొరబడపోతున్న నక్క యీ అలజడి విని పరుగెత్తుకుంటూ వస్తూ 'అయ్యయ్యో! కుటుంబగౌరవాన్ని మంటగలిపాడే తోడేలన్న! ఎంతఘోరం! ఎంతఘోరం!" అని అనేక విధాల సానుభూతి తెలిపింది.




అసలే కోపంగావున్న బెబ్బులికి ఆ మాటలు చుఱుమనిపించినై. తోడేలునూ నక్కనీ వుద్దేశించి "దాయాదులమంటూ ఎంత మోసంచేశారు! మీరు దుష్టులు! రూపంలో నా పోలికలున్నవేమోకాని బుద్ధిలో మీకూ నాకూ సామ్యమే లేదు. ఈ సారికి వదులుతున్నాను. పోండి, మీదారిన మీరు పోండి. మరెప్పుడైనా యీప్రాంతంలో కనబడ్డారా ప్రాణాలతో వదిలేదిలేదు!" అని హెచ్చరించింది.

తోడేలూ, నక్కా బ్రతుకు జీవుడా అను కొంటూ, వెనుదిరిగి చూడకుండా అడవుల లోకి దౌడుతీసినై.




కాంతయ్యా, కోటయ్యా యిరుగుపొరుగున నివసించే రైతులు. వ్యవసాయపనులదగ్గిర నుంచీ ప్రతిచిన్నపనిలోనూ ఒకరికొకరు సహాయకారులుగా కాలంగడిపేవారు. వారి స్నేహం, కలుపుగోలుతనం మొత్తం గ్రామానికే ఆదర్శప్రాయంగా వుండేది.

ఒకనాడు హఠాత్తుగా వాళ్ళిద్దరూ నోటికి వచ్చినట్టల్లా తిట్టుకుంటూ, జుట్టూజుట్టూ పట్టుకోవడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. చూడవచ్చినవారందరూ ఆ కలహ కారణం తెలుసుకునేందుకూ, యిద్దరినీ శాంతపరిచేందుకూ ఎంతో ప్రయత్నించారు.

ఎవరెన్ని శాంతవచనాలు పలికినా, కాంతయ్యా, కోటయ్యా తిట్టుకోవడం మానలేదు. చుట్టూచేరిన గ్రామస్థులకు ఏంచేయాలో పాలుపోలేదు. ఇంతలో బారైన తెల్లనిగడ్డంతో, ప్రశాంతవదనంతో ఒక వృద్ధుడు అక్కడికి వచ్చాడు.

ఆ వృద్ధుడి ఆకారం, ముఖవర్చస్సూ చూసేసరికి కాంతయ్యా కోటయ్యా కళవెళ పడ్డారు. ప్రశాంతంగా అర్ధనిమీలిత నేత్రాలతో తమవైపే చూస్తున్న ఆ వృద్ధుడికి ఇద్దరూ వినయపూర్వకంగా నమస్కరించి కలహకారణం చెప్పసాగారు.

ఆ వచ్చినవృద్ధుడు ఇద్దరినీ మాట్లాడవద్దని చేత్తో ఆజ్ఞాపించాడు. తరవాత కాంతయ్యా కోటయ్యల్నేకాక చుట్టూచేరిన జనాన్నికూడా వుద్దేశించి ఇలాఅన్నాడు:

'మనుష్యులు ఒకరిమీద ఒకరు కోపగించుకోవడమే ఘోరం! కలహించుకునేవరకూ, తిట్టుకునేవరకూ పోవడమంటే ఘోరాతిఘోరం!! కలహకారణం యేదో నాకు యెవరూ చెప్పనవసరంలేదు. ఏ పరిస్థితులలోనూ, యెవరు యెంత కవ్వించినా, కనీసం కోపం కనపరచడంకూడా మానవలక్షణంకాదు!'

యస్. పార్థసారథి - విశాఖపట్నం

కాంతయ్యా, కోటయ్యేకాక అక్కడ చేరినవారంతా నిశ్చేష్టులై విన్నారు. నాలు గైదుక్షణాలు నిశ్శబ్దంగా గడిచినై. ఇంతలో ఓ యువకుడు జనంలోనుంచివచ్చి ఆ వృద్ధుణ్ణి సమీపించి—

'అయ్యా! ఏ పరిస్థితుల్లోనూ కోపం పొందకుండావుండడం మానవుడికి సాధ్య మయ్యేకార్యంకాదు!' అన్నాడు.

వృద్ధుడు పెద్దగానవ్వి, తెల్లని పొడుగాటి గడ్డాన్ని దువ్వుతూ, 'ఎందుకు సాధ్యం కాదు? నావిషయమే చెపుతున్నాను. ఎవరూ, ఏ పరిస్థితుల్లోనూ నాకు కోపం తెప్పించలేరు. మానవులేకాదు, ఆఖరికి దేవతలూ, రాక్షసులూ అయినాసరే!' అన్నాడు.

అడ్డుప్రశ్నవేసిన యువకుణ్ణి కోపంగా చూసి, వృద్ధుడికి నమస్కరించి జనం యెటువెళ్లవలసినవాళ్ళు అటు వెళ్ళారు. యువకుడు వృద్ధుడ్ని సమీపించి 'తాత గారూ!' అన్నాడు.

'ఏవిటి?' అన్నాడు వృద్ధుడు నవ్వుతూ.

'తాతగారూ' అన్నాడు యువకుడు మళ్లీ.

'ఏవిటో చెప్పు?' అన్నాడు వృద్ధుడు. ఈసారి నవ్వకుండా.

'తాతగారూ' అన్నాడు యువకుడు మళ్లీ.

'ఏమిటో చెప్పరాదా?' అన్నాడు వృద్ధుడు కోపంగా చూస్తూ.

'తాతగారూ' అన్నాడు యువకుడు మళ్లీ.

'ఓరి వెధవా! నీకేమైనా పిచ్చా?' అన్నాడు వృద్ధుడు గుడ్లెరచేసి.

'తాతగారూ' అన్నాడు యువకుడు మళ్లీ.

'ఓరిశుంఠా! నీడొక్క చీలుస్తావుండు!' అంటూ వృద్ధుడు, చేయెత్తాడు.

యువకుడు నవ్వి 'ఏ పరిస్థితుల్లోనూ మనిషికి కోపంరాకూడదు!' అన్నాడు.

వృద్ధుడు తల వంచుకుని తిరిగిచూడ కుండా వెళ్ళిపోయాడు. చూచారా, ఇన్ని నీతులు చెప్పిన ఆ మహానుభావుడుకూడా తనదాకా వచ్చేసరికి ఎలా జారుకున్నాడో!






అస్సాంలో రాంపూర్ అనే పట్టణం వర్తకానికి ప్రసిద్ధికెక్కింది. ఆ పట్టణంలోని పెద్దవర్తకులలోకల్లా పెద్దవాడు దుర్గాసింగు.

అనేక దేశాలనుంచి వర్తకులు, అనేక రకాల వ్యాపారవస్తువులతో ఆ పట్టణానికి వస్తూవుండేవారు. దుర్గాసింగు ఆ పట్టణ వర్తకుల్లో ముఖ్యుడుగనుక ప్రతివారూ అతనితో ఏదో బేరం సాగించనిదే తిరిగి వెళ్ళడమంటూ వుండేదికాదు.

ఒకనాడు చైనాదేశపువర్తకుడైన మాంగ్ అతనియింటికి వచ్చాడు. విలువైన చీని చీనాంబరాలూ, అద్దాలూ, రకరకాల బొమ్మలూ దుర్గాసింగ్‌కు చూపి, ఆ వస్తువులకు బదులు తిరిగి తనకుకావలసిన వస్తువులను దుర్గాసింగ్‌వద్దనుండి తీసుకునేందుకు అంగీకరించాడు. అదేవిధంగా వస్తువుల విలువను వస్తువుల రూపంలో తీసుకున్నతరువాత మాంగ్ తన చేతిలోని సంచి నుండి ఒక గాజుసీసా తీస్తూ "ఇది రొఖ్ఖానికి మాత్రమే అమ్ముతాము. ఎటువంటి గాయాలనూ, నొప్పులనూ అమోఘంగా కుదురుస్తుంది" అన్నాడు.

దుర్గాసింగ్ కడు వృద్ధుడు. వెన్నెముకా, కీళ్లకూ సంబంధించిన నొప్పులతో అతడు సతమతమౌతుండేవాడు.

మాంగ్ చెప్పిన వెలకు దుర్గాసింగ్ ఆ ఔషధం కొన్నాడు. తెల్లని సీసాలో ఎర్రగా వున్న ఆ ద్రావకం శరీరంమీద రుద్దగానే అన్ని నొప్పులూ పటాపంచలైనై. దుర్గాసింగ్ ఎంతో సంతోషించాడు. మాంగ్‌ను కేవలం వ్యాపారిగామాత్రంకాక స్నేహితునిగా తలచి గొప్ప అతిథ్యం యిచ్చాడు.

మాంగ్ ఒక నెలరోజులపాటు అక్కడే ఉండిపోయాడు. దుర్గాసింగూ అతడూ ప్రాణమిత్రులయ్యారు. దుర్గాసింగ్ పుత్రుడైన ప్రసాద్‌సింగ్‌కు అతడు తన దేశాన్ని

యస్. యమ్. చౌదరి - కాళహస్తి

గురించీ, అనుభవాలను గురించీ అనేక వింత విచిత్ర విషయాలు చెప్పాడు. చైనా దేశానికి రావలసిందనీ, చాటుంగ్ పట్టణంలో తనయింట రెండురోజులపాటు అతిథులుగా వుండిపోవలసిందనీ తండ్రీకొడుకు లిద్దరినీ ఆహ్వానించాడు.

మాంగ్ తిరిగి చైనాదేశం వెళ్ళిపోయాడు. దుర్గాసింగ్ కొన్న ఆ ఎర్రద్రావకం కొద్ది రోజులకల్లా అయిపోయింది. మళ్ళీ వెన్నుపోటూ, నరాల నొప్పులూ ఎక్కువకాగా దుర్గాసింగ్ మంచంపట్టాడు. రాత్రింబవళ్లు విపరీతమైన బాధతో అతడు మూలుగుతూ వుండేవాడు.

తండ్రిస్థితికి ప్రసాద్‌సింగ్ చాలా విచారించాడు. ఆ ఎర్రద్రావకం మరికొంత సంపాయించగలితే తండ్రి ఆరోగ్యం చక్కబడగలదని ప్రసాద్‌సింగ్‌కు తెలుసు. కాని, అదికావాలంటే చైనాదేశం వెళ్ళాలి.

ఆరోజుల్లో ఒకదేశాన్నుంచి మరోదేశానికి వెళ్లడమంటే అపాయాలతో కూడుకున్న పని. కారడవులూ, క్రూరమృగాలూ, దోపిడి దొంగలూ, ఎన్నో గండాలను గడపవలసి వుండేది. కనుక, కొడుకు చైనా వెళ్ళేందుకు దుర్గాసింగ్ ఓపట్టాన అంగీకరించలేదు.




నమ్మకస్థులూ, సాహసులూ ఐన నలుగురు నౌకర్లువెంటరాగా, ప్రసాద్‌సింగ్ అన్ని అపాయాలనూ దాటి చివరకు చాటుంగ్ పట్టణం చేరాడు. మాంగ్ అతడిని ఎంతో గౌరవించి తండ్రి క్షేమసమాచారాలు అడిగాడు.

ప్రసాద్‌సింగ్ తను వచ్చినపని విపులంగా చెప్పాడు. ప్రాణమిత్రుడైన దుర్గాసింగ్ అనారోగ్యానికి మాంగ్ చాలా చింతించాడు. ఆ ఎర్రద్రావకం సిద్ధంగా లేదనీ, అక్కడకు కొంచెందూరంలో వున్న కొండలపై పెరిగే ఒకానొక చెట్టు ఆకులు తేవలసివుంటుందనీ ప్రసాద్‌సింగ్‌కు చెప్పాడు.



మరునాటివుదయం మాంగ్ సేవకులను తోడు తీసుకొని ప్రసాద్‌సింగ్ కొండలకు బయలుదేరాడు. సాయంకాలానికల్లా కొండ మీద ఆ చెట్లుపెరిగే ప్రాంతాలకు చేరు కున్నాడు. సేవకులు తెచ్చిన గోతాల నిండుగా ఆ ఆకు కోశారు. సూర్యాస్త మయం కాబోతోంది. అందరూ తిరిగి కొండ దిగసాగారు.

అగాధమైన పెద్దపెద్ద సొరంగాలతో, అడ్డదిడ్డంగా పడివున్న బండరాళ్లతో ఆ కొండ ప్రదేశమంతా, కమ్ముకువస్తూన్న ఆ చీకట్లలో మహా భయంకరంగా వుంది. సింహాల గర్జ నలూ, పెద్దపులుల రంకెలూ, తోడేళ్ల అరుపులూ అప్పుడప్పుడూ వారికి దాపున కూడా వినబడసాగినై. భయంతో వణుకుతూ భీతితో పక్కపక్కలకు చూస్తున్న సేవకు లకు ధైర్యంచెపుతూ, చేతిలోని కాగడాల వెలుగుతో రాత్రల్లా ఆ మహారణ్యాలు దాటుకొని బయటపడి, నడిరేయికల్లా కొండదిగి, సూర్యోదయంవేళకు ప్రసాద్ సింగ్ మాంగ్ ఇంటికి చేరాడు.

అతడు తెచ్చిన ఆకులతో మాంగ్ మందు తయారుచేసే కార్యంలో నిమగ్ను డయ్యాడు. యింతవరకూ అన్నిపనులూ సక్రమంగానే జరిగినందుకు ప్రసాద్‌సింగ్ ఎంతో సంతోషించాడు. కాని, ఒక సందేహం అతడిని బాధిస్తూనే వుంది. ఇప్పుడు తీసుకు వెళ్లే ఈ ద్రావకంకూడా అయిపోతే తరువాత ఏంచేయాలి? బాగా ఆలోచించగా అతడికో వుపాయం తట్టింది. ఆ ద్రావకం తయారు చేసేందుకు అవలంబించే పద్ధతులన్నీ తెలుసుకుంటే, అది తన తండ్రికే కాక, యితర రోగులకూ వుపయోగిస్తుందనీ, కొద్ది కాలంలోనే తను కోటీశ్వరుడు కావొచ్చనీ తలిచాడు.

"ఆ ద్రావకం తయారుచేసే పద్ధతులు నాకు నేర్పండి!" అని మాంగ్‌ను అడిగాడు.

ఆ మాట విని మాంగ్ నిట్టూర్చాడు. గొంతు సవరించుకుని, మెల్లగా, రహస్యంగా—

"ఈ మందు చేయడం ఎంతో కష్టపడి నేర్చుకున్నాను. నా తరవాత నా కొడుకు ఒక్కడికిమాత్రమే యీ రహస్యం చెప్పా లనుకున్నాను. కాని, వాడు సైనికుడుగా చేరి యుద్ధానికి వెళ్ళాడు. తిరిగి రావొచ్చు రాకపోవచ్చు!" మాంగ్ ఆపైన తడ బడ్డాడు. కన్నీళ్ళు తుడుచుకుని మళ్ళీ ప్రారంభించాడు :

"నాకో కూతురుమాత్రం వుంది. అదే నా సర్వస్వం. నువ్వు నా ప్రాణస్నేహితుడి పుత్రుడవు కనుకా, ధైర్యసాహసాలేకాక, సుగుణసంపద వున్నవాడివికూడా కనుక, ఆ నా కుమార్తెను వివాహమాడితే, యీ రహస్యం చెప్పేస్తాను" అన్నాడు.

మాంగ్ 'రింగ్‌లింగ్!' అంటూ పిలిచాడు. పక్కగదితలుపు నెట్టుకుని ఒక పదిహేను పదహారేళ్ల అమ్మాయి తొంగి చూచింది. "నా కూతురు!" అన్నాడు మాంగ్ ప్రసాద్‌సింగ్ ముఖంలోకి చూస్తూ.

ప్రసాద్‌సింగ్ శరీరం కంపరమెత్తింది. ముఖం వెలవెలపోయింది. మశూచికం మిగిల్చిపోయిన అవయవశేషాలతో, గాజు




కన్నుల్లాగా వెలుగు చీకట్లను గమనించని, జీవరహితమైన కనుపాపలతో రింగ్‌లింగ్ రూపం ఒకవిధమైన భయం కలిగించింది.

"కన్నతండ్రి రుణం తీర్చుకున్నవాడి వౌతావ్! కొద్దికాలంలోనే కోటీశ్వరుడివి కూడా కాగలవు!" అంటూ మాంగ్ వుపన్యాస ధోరణిలో చెప్పుకుపోతున్నాడు.

ప్రసాద్‌సింగ్ నిద్రమేలుకున్నవాడిలా అవులించి "సరే!" అన్నాడు.

రింగ్‌లింగ్‌తో ప్రసాద్‌సింగ్ వివాహం చాలా కోలాహలంగా జరిగిపోయింది. మాంగ్ అల్లుడికి ఆ ఎర్రద్రావకం చేసే పద్ధతులన్నీ నేర్పాడు. పదిమంది సేవకు

లను సాయమిచ్చి అల్లుణ్ణీ, కూతుర్నీ వాళ్ల పట్టణానికి సాగనంపాడు.

ప్రసాద్‌సింగ్ ఎలాగైతేనేం ఆరునెలలకు యింటికిచేరాడు. అతడు చేరుకునేసరికి ఇల్లు బావురుమంటోంది. ఒకమూల ముసలి నౌకరు ఒకడు గోడనానుకు కూర్చొని ఏదో గొణుక్కుంటున్నాడు. మరునిమిషంలో అతడు అన్ని విషయాలూ తెలియజెప్పాడు. తండ్రి దుర్గాసింగ్ గతించి అప్పటికే రెండు నెలలు కావస్తోంది. ఆఖరిఘడియలోకూడా అతడు కొడుకునుగురించి అడుగుతూనే వున్నాడట!

ప్రసాద్‌సింగ్ హృదయం దహించుకుపోయింది. అంత కష్టపడి తను తెచ్చిన ఔషధం తండ్రికి వుపయోగించలేదనేదే అతనికి పట్టుకొన్న దుఃఖం. ఆ రహస్యం నేర్చుకునేందుకు అంధురాలూ, కురూపీ అయిన స్త్రీనికూడా తను వివాహం ఆడాడు. ఇదంతా ఎవరికోసం? తండ్రికోసం! కాని, అంతా బూడిదలో పోసిన పన్నీరయింది.

శరీరానికి తగిలిన గాయాలను తగిన మందు మాన్పినట్లే, హృదయానికి తగిలిన గాయాలను అనుకూలమైనకాలం మాన్పేస్తుంది. ప్రసాద్‌సింగ్ క్రమక్రమంగా దుఃఖాన్ని దిగమ్రింగ గలిగాడు. తన తండ్రికి వుపయోగించని ఆ ఎర్రద్రావకం, దేశదేశాంతరాల్లోని అనేకమంది వ్యాధిగ్రస్తులకు వుపయోగించి కొద్దికాలంలోనే అతడు కోటీశ్వరుడయ్యాడు.

యౌవ్వన కాలమంతా రింగ్‌లింగ్‌ను అసహ్యించుకోవడంతోనే గడిపినా, వృద్ధాప్యంలో ధనంయిచ్చిన సౌఖ్యంవల్ల, దానికి కారణమైన భార్య రింగ్‌లింగ్ అంటే ప్రసాద్‌సింగ్‌కు ఎక్కడలేని ప్రేమా, అనురాగం పుట్టుకవచ్చింది. వాళ్ల జీవితశేషం సుఖంగా గడచిపోయింది.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

**అడ్డము:**

1. ఒక అస్త్రము
6. స్త్రీ
7. మరల
8. బిగువు
9. ఇంకను
11. శిల్పము
12. బాణము




**నిలువు:**

2. చుట్టుకొలత
3. శౌర్యము
4. సువాసన
5. ఒక పనివాడు
6. చిన్న నాటకము
10. కొండ

# వినోద చదరం



దిగువను ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో మీరు ఏడు మాటలు నింపాలి. సరియైన మాటలతో మీరు నింపగలిగితే అన్ని మాటలలోను చివరి రెండు అక్షరాలూ ఒకేలాంటివి వస్తయ్. దీనిని పూర్తి చేయగలరేమో చూడండి.

మీకు తెలియకపోతే జవాబుకి 54-వ పేజీ చూడండి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | | | | |
| 2. | | | | |
| 3. | | | | |
| 4. | | | | |
| 5. | | | | |
| 6. | | | | |
| 7. | | | | |

**ఆధారములు:**

1. మబ్బు
2. సమ్మతి
3. వేయికోట్లు
4. గర్వము
5. కలువ
6. వేడుక
7. ధ్వని




## మాయ లోటా

ఈ ఇంద్రజాలం తమాషా చూడండి. టేబిల్‌మీద ఒక పెట్టె పెట్టివుంది. అది కొయ్యపెట్టె అయినా కావచ్చు, లేదా అట్ట పెట్టె అయినా కావచ్చు. దానికిపైన ఒక మూత వుంది. ప్రక్కన ఒక లోటా వుంది. అందులో బటానీలలాంటివి వున్నాయి.

ఇంద్రజాలికుడు ఆ పెట్టెలోని బటానీలు తీసుకుని వాటితో లోటా నింపుతాడు. (ప్రక్కనున్న చిత్రం చూడండి). మళ్ళీ అందరియెదుటా ఆ లోటాలోని బటానీలన్నీ ఆ పెట్టెలో పోసేస్తాడు. తర్వాత ఆ లోటా ఆ పెట్టెలోపెట్టి మళ్ళీ బటానీలతో దాన్ని నింపి ప్రేక్షకులదగ్గిరకు తీసుకువస్తాడు.

ప్రేక్షకులవద్దనుంచి జేబురుమా లొకటి తీసుకుని దానిమీద కప్పుతాడు. మరుక్షణంలో ఆ రుమాల తీసివేయగానే దాన్నిండా చాక్‌లెట్లూ - పంచదారబిళ్లలూ - ద్రాక్షపళ్లూ మొదలైనవి వుంటాయి. వాటిని అక్కడున్న పిల్లలకు పంచిపెడితే వాళ్ళు చక్కగా తింటూ ఆ గారడీని మెచ్చుకుంటూ ఇళ్లకు వెళ్లిపోతారు. ఇదేదో కష్టమైన ఇంద్రజాలం అని అనిపించవచ్చు. కాని నిజానికి అంత కష్టమైనదికాదు.

ఒకేవిధంగావుండే రెండు లోటాలు ఈ ఇంద్రజాలానికి అవసరం. ఒక లోటాను



చాక్‌లెట్లు, పంచదారబిళ్లలతో నింపి, పైన మాత్రం కాసిని బటానీలు—మరమరాలు కాని (ఏవి ఉపయోగించతలచుకుంటే

అవి) పోసి ఆ లోటాను ముందుగానే ఆ పెట్టెలో పెట్టివుంచాలి. ప్రేక్షకులకు ఈ సంగతేమీ తెలియదు. అందుచేత వాళ్లు ఏమాత్రం సందేహించరు.

రెండోసారి మళ్లీ బటానీలు లోటాలో పోసేప్పుడు నేర్పుగా ఈ లోటా పెట్టెలో పెట్టేసి, అదివరకు పెట్టెలోవున్న లోటాను ప్రేక్షకుల దగ్గిరకు తీసుకురావాలి. ఈ లోటాలను మార్చటం అంటే కష్టం అనుకుంటారేమో, నిజానికంత కష్టంకాదు. ముందు ప్రేక్షకుల యెదుటే లోటాలో బటానీలు పోస్తారు కనుక - ఈ లోటాలో మాయ ఏమీలేదు,




మామూలు లోటాయే అనుకుంటారు వాళ్లు. రెండోసారి ఈ లోటాను పెట్టెలోపెట్టి మళ్ళీ బటానీలతో నింపేటప్పుడుమాత్రం దీన్ని అక్కడేవుంచి, అదివరకు చాక్లెట్లతో నింపివున్న లోటాను ప్రేక్షకులదగ్గిరకు తీసుకురావాలి. దానిమీదకూడా పైన ఉలిపిరికాయితం పరిచి బటానీలు కాసిని పైవరస పోసివుంటాయి కనుక అది మొదట చూసిన లోటాయే అని ప్రేక్షకులు భ్రమపడతారు. ఈ రెండు లోటాలూ పెట్టెలో ఎలావుండేదీ రెండో చిత్రంలో చూడవచ్చు. ఈ ఇంద్రజాలం చేసిచూపేటప్పుడు ఈ బటానీలూ - ఈ చాక్లెట్లే ఉపయోగించాలని లేదు. తమ తమ తెలివితేటలనుబట్టి ఇలాంటి వస్తువులను వేటినైనా ఉపయోగించవచ్చు.

అయితే ఈ ఇంద్రజాలం చెయ్యాదలచుకున్నప్పుడు దీనికి అవసరమైన ఏర్పాట్లన్నీ ముందుగానే చేసుకుని వుంచుకోవాలి. ఈ ఇంద్రజాలంకూడా ఎప్పుడో ఒకసారి చేయాల్సిందేకాని, ప్రేక్షకులకు మాటిమాటికీ చేసిచూపించకూడదు.

---

పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరువ్రాసే ఉత్తరాలు ఇంగ్లీములోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్

12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,

కలకత్తా - 19

# అట్టమీది బొమ్మ

కౌరవులకూ పాండవులకూ మధ్యని యుద్ధం పొసగుతుందనే వార్త బలరాముని చెవినిపడింది. అతనికి ఏ పక్షమందు చేరటానికీ ఇష్టంలేకపోయింది. మధ్యస్థుడుగా వుండటమే మంచిదనే వుద్దేశంతో, తీర్థయాత్ర నెపంమీద బయల్దేరాడు. అనేక నదులలో మునిగి, తీర్థాలు సేవించుకొంటూ నైమిశారణ్యం ప్రవేశించాడు.

అక్కడ తపస్సులో మునిగిఉన్నటువంటి మునీశ్వరులందరూలేచి, బలరామునికి ప్రణమిల్లి, ఆ మహాత్ముణ్ణి బహువిధాల పూజించి గౌరవించారు. మునులందరూ అతన్ని పూజించారుకాని, రోమహర్షణుడనే ఋషిమాత్రం, బలరాముని గౌరవార్థం కూచ్చున్నవాడు లేవనైనాలేదు.

'ఏమిటీ పాపాత్ముడి పొగరు!' అని చెప్పి బలరాముడు ఉగ్రుడై, చేతనున్న కుశాగ్రంతో ఆ రోమహర్షణుడ్ని తెగటార్చివేశాడు. అప్పుడు మునిబృందంలో హాహాకారాలు చెలరేగినై. 'మహానుభావా!'—లోకపావనుడవైనటువంటి నీవే ఇలా తొందరపడితే ఏమనుకోవాలి? నీకిప్పుడు బ్రహ్మహత్యాపాతకం చుట్టుకున్నదే...!' అంటూ ఋషులు తమ కలవరాన్ని వెల్లడించారు.

అందుకు బలదేవుడు 'తగిన ప్రాయిశ్చిత్తం మీరే విధించండి. అనుభవించటానికి సిద్ధంగా వున్నా'నని పశ్చాత్తాపం తెలిపాడు. ఇది విని మునులు, "మహాత్మా! ఇల్వలుని కొడుకు పల్వలుడనే రాక్షసుడు ఉన్నాడు. వాడు ప్రతిపర్వమందూ వచ్చి మమ్మల్ని దూషించి, హింసిస్తూవుంటాడు. వాడిని హతమార్చినట్టయితే మాకేకాదు, లోకానికే గొప్ప మేలుచేసినవాడవు అవుతావు. ఐతే—వాడిని చంపటం పాపంకదా? అని అడగవచ్చు. దానికీ ఒక ప్రతిక్రియ వున్నది. వాణ్ణి వధించి తరువాత పన్నెండు నెలలు భారతదేశమంతటా తీర్థయాత్రలు సేవించినపక్షమందు పాపవిముక్తి ఐపోతుంది' అని వారు చెప్పగా, బలరాముడు ఘోరాకారంలో వుండే పల్వలుణ్ణి పట్టి యీడ్చి, ముసలంతో తలపైన అణచేసరికి ఆ ద్రోహి నెత్తురు గ్రక్కుకొంటూ, పర్వతంలాగ నేలగూలి, ప్రాణంవిడిచాడు.

ఈ విధంగా బలరాముడు మునుల ఆజ్ఞప్రకారం దుష్టసంహారం చేసి, వారి సెలవు తీసికొని తీర్థయాత్రలకు వెళ్లిపోయాడు.

# రంగుల బొమ్మ కథ—3-వ బొమ్మ

రోజులూ, నెలలూ గడిచిపోతున్నై. కాని ఆ గొడుగుమాత్రం అమ్ముడుపోక అలానే వుండిపోయింది. చాంగ్ తల్లికి విసుగెత్తింది. 'ఏమైనాసరే, ఈసారి ఏదో ఒకధరకు యిదికూడా అమ్మివేసితీరాలి' అని నిశ్చయించుకున్నది. అలా అనుకున్నదేకాని, చివరకు ఆ గొడుగుకి తనుకూడా వూహించలేని ధరవచ్చింది. ఎందుచేతనంటే చాంగ్ తల్లి అలా నిశ్చయించుకున్న మరునాడే ఒక ధనికుడు, తన కుమార్తెను వెంటబెట్టుకుని దుకాణానికి వచ్చాడు. ధనికుడి కుమార్తె గొడుగుని చూచీ చూడటంతోనే, ఎంత వెలఐనాసరే అది కొనిప్వమని పట్టుపట్టింది. తనకు ఏకైకపుత్రిక కావటంవల్ల ఆమె ఎన్నడు ఏదికోరినా తండ్రి కాదనలేదు. అందుచేత చాంగ్ తల్లి చెప్పిన వంద రూపాయలూ ఇచ్చివేసి కుమార్తె శాన్‌మింగ్‌కి గొడుగుకొని యిచ్చాడు.

శాన్‌మింగ్ ఎక్కడికి వెళ్ళినా ఆ గొడుగుకూడా తీసుకువెళ్ళుతుండేది. ఆమెకు యుక్తవయస్సు వచ్చింది. తతిమా విషయాలలో ఎలాగో, అలాగే ఆమె వివాహ విషయంలోకూడా శాన్‌మింగ్ తండ్రి ఆమె ఇష్టమే యిష్టమని చెప్పాడు. తనకు నచ్చిన యువకుని వివాహం చేసుకోమని అనుమతిచ్చాడు.

కొంతకాలానికి శాన్‌మింగ్ యింటికి, ఆమె తండ్రి స్నేహితుడు ఒకాయన కుమారుని వెంటబెట్టుకు వచ్చాడు. ఆ యువకుని చూడగానే శాన్‌మింగ్ అతనిపైన మక్కువపడి వలచింది. ఆ సాయంత్రమే, శాన్‌మింగ్ దేశాచారం ప్రకారం ఆ యువకునితో తమ ఉద్యానవనంలో విహరించబోయింది. శాన్‌మింగ్ తన నిశ్చయాన్ని ఆ యువకుడికి తెలియచెయ్యబోయేసరికి తనచేతిలో గొడుగుని ఎవరో పట్టుకులాగినట్టు అనిపించింది. శాన్‌మింగ్ తెల్లబోయి చూచింది. ఆమె, ఆ యువకుడు తప్ప మరెవరూ ఆ చుట్టుపట్ల లేరు. భ్రమపడ్డాననుకుని మళ్ళీ మాట్లాడబోయేసరికి మళ్లీ అదేవిధంగా ఎవరో గొడుగు గుంజినట్లయింది. శాన్‌మింగ్ యిందులో ఏదో మాయ వున్నదనుకున్నది. మరి మాట్లాడటానికి ప్రయత్నించక మరికొంతసేపు అక్కడే ఎలాగో కాలక్షేపంచేసి యిల్లుచేరుకున్నది.

# ఒంటిగీత బొమ్మ



పంపినవారు: జి. మునికృష్ణయ్య - తిరుపతి

### 49-వ పేజీలోని పజిలుకి జవాబు:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1 పా | శు | 2 ప | త | ము | |
| 3 ప | | | రి | | | 4 ప |
| రా | 5 క | | ధి | | 6 నా | రి |
| 7 క్ర | ష్మ | అ | | 8 ప | టి | మ |
| 9 మ | రి | | 10 న | | 11 క | ళ |
| ము | | | గ | | | ము |
| | 12 శి | లీ | ము | ఖ | ము | |

### 49-వ పేజీలోని వినోద చదరానికి జవాబు:

| | | | | |
|---|---|---|---|---|
| 1. | నీ | ర | ద | ము |
| 2. | అ | మో | ద | ము |
| 3. | అ | ర్బు | ద | ము |
| 4. | ప్ర | ల్ల | ద | ము |
| 5. | కు | ము | ద | ము |
| 6. | వి | నో | ద | ము |
| 7. | ని | నా | ద | ము |

# పెళ్లిచేసిచూడు

"సత్యమే జయం" అన్న ఈ హాస్యనాటిక విజయవారి "పెళ్లిచేసిచూడు" లోనిది. ఇందులో పాఠాలురాని ఒక పిల్లవాడు బడి ఎగగొట్టటానికి దొంగఎత్తు వేసి అమ్మమ్మను నమ్మిస్తాడు, కాని వాడి అమ్మ వాడికి తగినట్టు బుద్ధిచెబుతుంది. ఈ నాటిక పిల్లలందరూ తప్పక చూడదగినది. విజయవారి "పెళ్లిచేసిచూడు"లో దీనిని చూసి ఆనందించండి.

## సత్యమే జయం

[హాస్య గేయనాటిక]

పిల్లవాడు, అమ్మ, అమ్మమ్మ

పిల్లవాడు: అమ్మా నొప్పులే - అమ్మమ్మా నొప్పులే
ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసౌదామని
పట్టుబట్టి నే పాఠాల్ చదివితె
పరీక్షనాడే పట్టుకున్నదే
బడికెట్లా నే వెళ్ళేదే?... ॥ అమ్మా ॥

అమ్మమ్మ: బాబూ! లేపరా! - ఈ మందూ త్రాగరా!
పరీక్షకోసం దిగులుపడకురా
వచ్చేయేటికి ప్యాసౌదువులే
నువు బాగుంటే మాకుచాలురా
నిక్షేపంగా యింటనుండరా... బాబూ...

అమ్మ: అయ్యోగారెలా - అయ్యయ్యోబూరెలా
పరీక్షయిచ్చే పాపకోసమని
కమ్మకమ్మగా నేను చేస్తినే
అయ్యొ నోట శనిపట్టెనో యేమో
మాయలమారి నొప్పులొచ్చెనే... ॥ అ ॥

పిల్ల: అమ్మా! పాయెనే-అమ్మమ్మా పాయెనే
అమ్మా ఒక్కటే - అమ్మమ్మా ఒక్కటే

అమ్మమ్మ: బాబూ తినకురా - నీకడుపు నొచ్చురా
పిల్ల: అమ్మా ఒక్కటే - అమ్మమ్మా ఒక్కటే
అమ్మ: బుద్ధివచ్చెనా - నీకు బుద్ధివచ్చెనా
పిల్ల: బుద్ధివచ్చెనే - అమ్మ బుద్ధివచ్చెనే
అమ్మ: లెంపలేసుకో అయితె లెంపలేసుకో
పిల్ల: వేసుకొంటినే అమ్మ ఒక్కటివ్వవే
అమ్మ: బడికి పోదువా?....
పిల్ల: అమ్మ బడికిపోదునే బాగచదువుకొందునే.

స్టూడియో: వాహిని :: నిర్వహణ: నాగిరెడ్డి & చక్రపాణి

నిర్మాతలు:

## విజయా ప్రొడక్షన్స్ లిమిటెడ్, మద్రాస్



Chandamama, March '52 Photo by Anant Desai

ద మ న కు లు

CHANDAMAMA (TELUGU) MARCH 1952 REGD. No. M. 4854




రంగులబొమ్మ కథ — 3-వ బొమ్మ